# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)



డిసెంబరు 1981

సంపుటము : 58 సంచిక : 5

విడిప్రతిక వెల నాలుగు రూపాయలు



శ్రీమతి ఇందిరాగాంధీ
ప్రధాన మంత్రి

# "భవిష్యత్తు వారిదే"





శ్రీ టి. అంజయ్య
ముఖ్యమంత్రి

"నేటి బాలల ద్వారానే రేపటి భారతదేశాన్ని మనం నిర్మిస్తాం" అని నవభారత నిర్మాత జవహర్లాల్ నెహ్రూ అన్నారు. ఈ మహత్తర ఆదర్శాన్ని పాటిస్తూ మన రాష్ట్రంలో బాలల పరిస్థితులను మెరుగుపర్చడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తీవ్రంగా కృషి చేస్తోంది.

బాలల ప్రతిభను ప్రోత్సహిస్తూ విద్యాయేతర కార్యక్రమాలను అభివృద్ధిపరచే లక్ష్యంతో 1976లో బాలల అకాడమీని ఏర్పాటు చేసిన ప్రప్రథమ రాష్ట్రం ఆంధ్రప్రదేశ్. ఈ లక్ష్యంతోనే ప్రతి సంవత్సరం రాష్ట్రస్థాయి పోటీలను నిర్వహిస్తున్నారు.

మన రాష్ట్రంలో 66 బాల్వాడీలున్నాయి. పాఠశాలలకు వెళ్లే బాలబాలికలకు వినోద కార్యక్రమాలను అందించడానికి వీలుగా 25 బాలవిహార్‌లు పనిచేస్తున్నాయి.

నిరాశ్రయులు, నిరాధారులు, ఆర్థికంగా వెనుకబడిన తరగతుల బాలల పోషణ నిమిత్తం 55 బాలల సంరక్షణ గృహాలు పనిచేస్తున్నాయి. వాటిలో 5 గృహాలను ప్రత్యేకంగా కుష్ఠురోగులైన బాలల నిమిత్తం నిర్వహిస్తున్నారు.

వ్యవసాయ కూలీలకు చెందిన 5 సంవత్సరాలలోపు వయస్సు గల బాలల నిమిత్తం మనరాష్ట్రంలో 138 క్రెచెస్ ఉన్నాయి. వాటిలో 23 క్రెచెస్ ప్రత్యేకంగా గిరిజన బాలల నిమిత్తం ఉద్దేశించబడినాయి.

మన రాష్ట్రంలో బాలల రోగ నిరోధక చికిత్స, ఆరోగ్య పరీక్ష, సంరక్షణ, సాంప్రదాయేతర విద్యా కార్యక్రమాల నిర్వహణ నిమిత్తం 13 కేంద్ర పరమైన పథకాలు, 9 రాష్ట్రపరమైన పథకాలను అమలు జరుపుతున్నారు.

బాలల అభివృద్ధి పథకాల నిమిత్తం 1981–82 సంవత్సరంలో రు. 20 లక్షలు కేటాయించారు. ఆంధ్రప్రదేశ్‌లో జాతీయ బాలల నిధి నిమిత్తం రు. 10 లక్షలు కూడా మంజూరు చేశారు.

ఆంధ్రప్రదేశ్‌లో బాలలను ఉత్తమ జాతీయ పౌరులుగా
తీర్చిదిద్దడానికి నిరంతరం కృషి జరుగుతోంది.

Advt - No. 55 DIPR

సమాచార పౌర సంబంధశాఖ డైరెక్టరుచే ప్రకటితము, హైదరాబాదు. DIPR No. 52428/Advt-1/C3/81

## స్వ వి ష య ం

భారతి ప్రచురణని తాత్కాలికంగా నిలిపివెయ్యవలసి వచ్చిన సంగతి పాఠకులకి తెలిసినదే. నవంబరులో తిరిగి ప్రచురణ మొదలుపెడదామనుకున్నాము కాని అనుకోని ఇబ్బందులు కొన్ని ఎదురయి ఈ ప్రయత్నం డిసెంబరుకి వాయిదా పడింది. జనవరి 1982 నుంచి "భారతి" సక్రమంగా వెలువడగలదని మనవి చేసుకుంటున్నాము.

ఉత్పత్తి ఖర్చులు బాగా పెరిగిపోయాయి. "భారతి" వెల కూడా పెరగక తప్పలేదు. పాఠకులు పరిస్థితులని సహృదయంతో అర్థం చేసుకుని ఎప్పటిలాగే "భారతి" అభివృద్ధికి తోడుపడగలరని ఆశిస్తున్నాము. రాసేవారి సహకారం అవసరమని వేరే చెప్పనక్కరలేదు. రచయిత్రులు, రచయితలు, పాఠకులు—వీరందరూ ప్రదర్శిస్తున్న ఆదరాభిమానాలకి కృతజ్ఞులము.

సంపాదకుడు



# విషయానుక్రమణిక

## డిసెంబరు 1981





# స్త్రీ సూక్తము

శ్రీ వజ్ఝల కాళిదాసు

వసుంధరా సంపదలై
వసంత కుసుమావళుల్
నాలోన లేపెనే కోర్కెల్
వైళమ్మె రమ్ము కామినీ !

నీ కన్నులలో వెలిగే
నీలాల గగనమ్ములో
ఎగిరి యాడగా నాలో
ఎదిగె నెన్నో రెక్కలు !

వయారంగా నాట్యమాడే
మయూరంగా నీ అందముల్
సంచరించు నాగుండెల్లో
పంచవర్ణ పింఛమ్ములై !

ఓ కల్పనా నిర్మితాంగి
నా ఊహాలోక సుందరీ
సకల ఫల సంపంగి
వికచ మల్లీ మంజరీ !

కన్ను లల్లన విప్పారన్
నన్ను వేమారు చూచుచున్
సౌందర్య రాశియై నిల్చె
నా ప్రియ స్త్రీని పిల్చెదన్.

ప్రభాతారుణ వర్ణాల్లో
ప్రభవించు సౌందర్యముల్
విందులన్ చిందు వేళన్ నా
అందాల స్త్రీ కాహ్వానముల్.

అపాంగ దృష్టి నాకాశం
త్రపాస్మితాల మల్లియల్
నర్తింప నాకు కన్పించే
నా ప్రియస్త్రీ కాహ్వానముల్.

రహస్సుధా మాధురులో
అహర్ముఖోద్యత్ కాంతులో
కదలికలలో చూపే
కాంతామణి కాహ్వానముల్.

చమకిత విద్యుల్లతా
గమనముల్ చాలింపవే ;
అమలిన మదాహ్వాన
గీతా గాన మాలింపవే !

సుమన స్సుకుమారంబౌ
నీ అంగ భంగిమాలలో
లోక సౌభాగ్య సంధాన
లక్ష్మీ లాస్యమ్ము చూచెదన్.

సంధిత ధన్వాకృతియౌ
నీ భ్రుకుటీ విన్యాసమున్
శత్రు సంహార చణమ్మౌ
దుర్గా రూపమ్ము గాంచెదన్.

నా గళంలో నా కలంలో
రసస్ఫూర్తులు చిమ్మగా
నన్ను ప్రేరేపించు నిన్నే
భారతిగ భావించెదన్.

నా కలల్లో ఆశయాల్లో
నాట్యమాడెడి ఆకలిన్
దీర్చు ఊహల నిచ్చు ని
న్నన్నపూర్ణగ నెన్నెదన్.

సర్వ సర్వం సహా చక్రం
బే మహత్తర శక్తితో
సకల సంపన్నంబౌ ఆ
స్త్రీకి మంగళ హారతుల్ !



# కార్నివోరస్

## డా॥ నాయని కృష్ణకుమారి

ఇదేదో తెలియని బాధాంకూరం
గుండె పాదులో మొలిచి
తీగెలు సాగి అల్లుకు పోతూ
అయ్యో ఏదీ నా ముఖం ఎక్కడుంది !

తలయెత్తే ప్రతిస్పందననీ
ఆక్రమించి ముక్కలు చేస్తూ
ఎన్నెన్ని కొనలు తెరిచిన ఆకుల బాకులు !
సన్నని యీనెల్లో ఉక్కిరి బిక్కిరై
ఊపిరి గట్టిగా తీసుకోడానికైనా
అయ్యో ఏదీ నా ముఖం !

ఈ మొరటు తీగె ఇంతగా పెరిగి
ఇప్పటికే నాకళ్ళు తినేసింది
చెవులు తినేసింది
ఊపిరిని ఆపేసి
ప్రాణరసాన్ని పీల్చే ప్రయత్నంలో
విరగబడి పాకుతోంది !

నేనెంత నిస్సహాయంగా
నిల్చిపోయాను !
విలవిలా తన్నుకోడానికి
నా ముఖానికి కాళ్లైనా లేవు.

దిక్కు తోచక
లోపలికి కుంచించుకు పోతే
గుండెకు కళ్ళున్నాయా !
అది మంటలు చుట్టుకున్న
మల్లెమొగ్గ !

ఓయి భగవంతుడా !
కళ్ళులేని కబోదిని
విన లేని చెవిటిని
నాకు మరో జత కళ్ళను దానం చెయ్యి
రెండు చెవుల్ని ఇప్పించు !

లోలోపల
నిస్సారంగా పడి ఉన్న
కాంక్షా కణాలకు జీవంపోసి
అవి యేవైపుకు పయనిస్తున్నాయో
అక్కడ నుండి
యీ గుండె మోతకు జతగా
ఒక్క గుండెను మోగించు !



# బృహదమరకోశము

శ్రీ విక్రాల శేషాచార్యులు

సంస్కృత నిఘంటువులలో నమరకోశమునకు పూర్వము ననంతరమును పెక్కండ్ర కవివరులచేత పెక్కు కోశములు రచితములైనను అమరకోశమునకు వచ్చినంత ప్రఖ్యాతి ఆ తతిమ్మా నిఘంటువులకు రాలేదు. అందుకు కారణ మది నాఽతి విస్తృతము నాఽతి సంక్షిప్తము నగుటయే. (ఈ విషయమును ముందు 1978 వ సంవత్సరము జులై నెల "భారతి" సంచికలో ప్రచురించఁబడిన "అమరశేషము" అను వ్యాసమునందు విస్తరముగఁ దెలిపి యున్నాను.)

రచయితయైన అమరసింహశబ్దములో నామైకదేశ గ్రహణ న్యాయముచేత చివరి సింహశబ్దము వదలివేయఁబడి అమరశబ్దము మిగిలినది. రామచంద్రుఁడు – రాముఁడు, భీమసేనుఁడు – భీముఁడు మొదలుగాఁగల శబ్దములమాదిరి. కావున అమరకోశ మని యైనది. అమరకోశమనఁగా అమరసింహునియొక్క నిఘంటువని యర్థము. అమరసింహునిచేత రచించఁబడిన కోశ మని భావము. దీనికి రచయిత పెట్టినపేరు "నామలింగానుశాసన" మని. ఈ పేరునే ఆయన గ్రంథములో కాండాంతములలో

శ్లో॥ ఇత్యమరసింహకృతౌ నామ లింగానుశాసనే....

ఇత్యాది విధమున పేర్కొనినాఁడు.

ఈపే రాయన తాను రచియించ నెంచిన విధమునకు తగిన రీతినిఁ బెట్టినది. ఐతే పేరు పొడవుగ నుండినందున విద్వాంసులు సుఖోచ్చారణ నిమిత్తము దీని "నమరకోశ" మని కవిపేరుతో వాడుచున్నారు. కావ్యములలో కిరాతార్జునీయమును రచయిత పేరుతో "భారవి" యనియు, శిశుపాలవధమును "మాఘ" మనియు వాకొని నట్లు లని యెఱుంగఁ దగును. ఐనను కావ్యములలో యాదవాభ్యుదయము, నాటకములలో జానకీపరిణయము, సంకల్ప సూర్యోదయమువంటి గ్రంథముల పేళ్లు పెద్దవియైనను వాటిని సుఖోచ్చారణార్థము రచయితల పేళ్లతోఁ గాక కర్తలుంచిన పేళ్లతోనే పిలుచు చున్నారముకదా ? వీటిని పై గ్రంథములమాదిరి ఏల వాకొనుట లేదనినచో నెక్కువ వాడుకలో నున్నవాటి నట్లు చెప్పుచుండుట కలిగిన దనుకొనవలెను. ఈ యాదవాభ్యుదయము సంకల్పసూర్యోదయము మున్నగునవి పైన పేర్కొనిన మాఘాదులవలె నత్యంత రసభరితములు, విద్వజ్జన మనోహరములైనను అవి యుత్పన్నమైన దేశములయందే ప్రఖ్యాతి కలిగి యుండుటనుఁ జూడ వాటి జన్మకాలవిశేష మట్టి దనియొండె, లేక పాఠకులకు వాటిని చదివి ఆనందించు భాగ్యసంపద లేదని యొండె తలంచవలెను. లేక గ్రంథనామములకంటెను రచయితృనామధేయములు దీర్ఘములుగనో సమానములుగనో నుండుటచేతను వారినామములతో వారి రచనలను పేర్కొనుట కలిగియుండదు. పై యాదవాభ్యుదయ (మహాకావ్య), సంకల్పసూర్యోదయ (నాటక)ముల కర్త శ్రీ వేదాంతదేశికులు. జానకీ పరిణయ (నాటక) ప్రణేత రామభద్ర దీక్షితుఁడు. ఈరచయితలపేళ్లు ఈ గ్రంథముల పేళ్లతో సమానముగ పెద్దవిగ నున్నవి.

అమర కోశములో పలు విషయములు పరిత్యక్తములై యుండుట అమరసింహుఁడంతటి మహామేధావి మఱచి కాని, తెలియక కాని కాదు. తనకుఁ దెలిసిన సకల విషయములను నుడివినచో గ్రంథము పెఱిగి పెద్దదియై విద్యార్థులు చదువుట కలవి కాకపోవు నని తలచి కొన్ని ముఖ్యమయిన సంగతులను (పేళ్లను) నుడివి విడచినచో విద్యార్థులు కడమ సంగతులను గురువులకడ నెఱుంగం గలరను నుద్దేశముతో వదలిపెట్టెను. ఆయన అమరకోశములో చెప్పక వదలినవి కొన్ని :— దేవతలపేళ్లవద్ద స్వయముగనే దేవతలుగఁ బుట్టినవారు, కర్మలొనర్చి దేవతలైనవారు, గంధర్వులు, సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు, అప్సరసలు లోనగు దేవతాజాతి భేదములు; ఎదురుగాలి, ఈదరగాలి, పడమటిగాలి, మలయానిలము, బొడగొండ (కొండవలె లేచిన పెద్ద మేఘము), నక్షత్రములు, రాసులు, చాల కాలవిభాగములు; ఈల, లొట్ట, చప్పట్లు, చిందు, మంచినీళ్లు, ఉప్పునీళ్లు, మురికినీళ్లు, వేడినీళ్లు, కాఁగి చల్లారిననీళ్లు, అనేకవిధములైన జలజంతువులు; అగ్రహారము (ఇట్లే వివిధవర్ణములవారి పాలెములు), ఆసుపత్రి (వైద్యశాల), బడి, గుడి, గూడు, పునాది, ఇంటి అఱ, అఱమర, మొత్త, కుబుసము (తలుపుకు క్రిందను మీఁదను నుంచెడు కూచము), ఆడుబందులు, పిడచలు (ఆడుబందుల కాధారమైన యినుప వస్తువులు), గందపట్టెలు తడికె, కటకటాలు, చిలుకు, బీగముముద్ద, బీగముచెవి, దూలము, గుంటదూలము, గుజ్జులు, వాసము, పెండెలు, బూజు, గులకఱాయి, కంకరఱాయి, గుండ్రాయి, కల్వము, బొట్టడి (దొర్లించెడిఱాయి), సుద్ద, సున్నపుఱాయి, కమలాఫలపుచెట్టు, జామచెట్టు, చేమంతిచెట్టు,

బంతి చెట్టు, తులసి చెట్టు, పన్నీరు చెట్టు, మనోరంజనపుచెట్టు, ద్రాక్షచెట్టు, సీకాయచెట్టు, పంపరపనసచెట్టు, చిటికేసరపుచెట్టు, (సిరిపేము చెట్టని కొన్ని చోట్ల వాడుక), పులుగుడుచెట్టు (నల్లది-తెల్లది), మొగలింగచెట్టు, కలియచెట్టు, ఘూచక్రగడ్డ, పెన్నేరుగడ్డ, పెండలము, చేమగడ్డలు, గనుసుగడ్డలు, చిక్కుడు తీఁగె, చిలుకముక్కాకు, చిట్టియాకు, చెంచలికూర, తోఁటకూర, (పెరుగుతోఁటకూర- కొయ్యతోఁటకూర మున్నగు అందలి భేదములు), చుక్కాకు, గురుగాకు, అటికమామిడి, పేరంటాలాకు, కుప్పింటాకు, బొమ్మిడాలు, వల్లారియాకు (సరస్వతియాకు), మేఁకమెత్తనాకు, బుడ్డబుడుసర, చిటి (చాపలల్లునది), పూఁచికపుల్ల, జమ్ము, తుంగ, బ్రహ్మదండిచెట్టు, అక్రింతలు (అక్షంత లని కొందఱనెదరు), అఁకుయీనె, మండ, రెబ్బ, పంగ, పనసతొన, తాటిముంజె, కొత్తెము (తాటిపండు లోనికండ), వామి, గాజుపురుగు, పరిచెపురుఁగు, లద్దిపురుగు, నులిపురుగు, బుడ్డగొణుజు, గోమారి, ఉమ్మి, సపుర్త, ఓకరింత, కేకరింత, మూలుగు, మెటిక, చిటిక, తిమ్మిరి, కొంగర, కణత, కొనచెవి, గూబ (చెవిమొదట నుండు అంగవిశేషము), గూబ (చెవిలోపల నుండు అవయవవిశేషము), ముక్కుడూలము (ముక్కుయెముక), కొండనాలుక, పొదిగిలి, గొల్లి, బ్రొప్పె, షడ్డకుఁడు,(తోడియల్లుడు), వియ్యంకుఁడు, వియ్యపురాలు, వియ్యము, మధుపర్కము (పసుపు నీటిలోఁ దడిపి యెండవేసి, పెండ్లికొడుకుకు పెండ్లికూతురికి కట్టఁబెట్టెడు క్రొత్తబట్టలు), దుప్పటి, శాలువ, పంచపుఁబట్టెలు, మంచపుకోళ్లు, నులక, నవారు, సున్నము, సెమ్మె, ప్రమిద, కొడి, ఒకుగు, గ్రంథము, అంబారి, ఏనుఁగు దంతములకు తగిల్చెడు వెండిబంగారముల పొన్నులు, జీను(గుఱ్ఱపు వీఁపుపై వేసెడు మెత్త), (దాని నెక్కుటకు దాని కిరుప్రక్కల నమర్చి వ్రేలుచుండు యినుప కడియములవంటి మెట్లు), కుప్పె (గొడుగుమీఁది గుబ్బ), గుద్దు, పాడె, పటిక-పిల్లి పెసలు, పచ్చపెసలు, నల్లపెసలు. సజ్జలు, జొన్నలు, వేరుసెనగ, మెంతులు. గాదె, గోతము, బొట్ట, పాతర, కూటు, కళ్లము, పట్ట (గోనెపట్ట మున్నగునది) బిందె, బొక్కెన, చేఁదత్రాడు, చెంబు, తాంబాళము, తట్ట, మిళ్ళి, బాణలి, అట్లకాఁడ, సొట్ట (చెంబు లోనగునవి క్రిందఁబడుటలోనగువానిచేత నయ్యెడి నొక్కు), అప్పడాలు, వడియాలు, మణుఁగుపూలు, పూరి, కజ్జికాయ (దీనినే ఖజ్జకాయ యనెదరు), కలకండ, బెల్లము, రజ్జాయము, చింతపండు, జీడిపప్పు (కొందఱు ముంతమామిడిపప్పనెదరు), ముద్ద కర్జూరము (ముంతకర్జూర మని కొందఱనెదరు), గుజ్జుగురుగు (పులుసు మున్నగు పలుచని వంటకములు నిలచియుండుట కన్నాదులతోఁజేసెడు కట్టవంటిది) మేఁకమెడచన్నులు, ఉలి-సుత్తె, బాడిసె, పీఁకె (నాగసరములోనగు వాద్యముల ముఖమున జొప్పించెడు చుట్ట), పెంకు, చుట్ట, బిట్టీ, ఆవము బొరిగ [గడ్డి పెళ్లగించెడు గుద్దలి], కుప్పిగంతులు, పిల్లేరుగంతులు, పర్టీ [పరీటీ], బోల్తా [భోర్ల], సమ్మె, ముడి-మూట-మోపు-ఇత్యాద్యనేక విషయము లమరకోశములో లేవు. ఇప్పుడు ప్రఖ్యాతిలోనున్న అమరకోశమిట్టిది.

కొందఱు భాషాసేవకులు 1అమరసింహుడు మొదట సమస్త విషయములతో నిండిన ఒక పెద్ద నిఘంటువును నిర్మించి అది మిగుల పెద్దదియైనందున కొన్ని విషయములను తీసివేసి యిప్పటి యమరకోశమును తయారుచేసె నందురు. అది బృహదమరకోశ మనియు చెప్పెదరు.

దీనికి తోడుగ శిరోమణి శ్రీమాన్ చలమచర్ల రంగాచార్యులవారు రచియించఁగా ఏలూరులో మ. రా. రా. శ్రీ వెంకట్రామా అండ్ కో యజమానులవారైన శ్రీ ఈదర వేంకటరావు పంతులవారిచేత 1966వ సంవత్సరములోఁ బ్రచురించఁబడిన "ఆంధ్రశబ్దరత్నాకర" మనెడు బృహదకారాది నిఘంటువు మొదట సంస్కృత నిఘంటు పట్టిక అనుదానిలో [79వ పుటలో] [కర్తృనామము తెలియని నిఘంటువులు] అను శీర్షక క్రింద రెండవదొంతి [నిలువుచాలు]లో 124. బృహదమరకోశము [అమరసింహకృత మందురు.] అని యొక పంక్తి కలదు. ఇదియే అమరసింహుఁడు మొదట రచించిన సకల విషయ సంభృతమైన కోశమేమో ? వారెచ్చట చూచిరో వారియింటఁగాని మఱి యెచ్చటఁగాని కలదేని ఆ "బృహదమరకోశము" యొక్క స్వరూపము కాండ-వర్గాది విభాగముల పేళ్లు అవి యెన్ని ? శ్లోక సంఖ్య, ఇది యున్న తావు - ముద్రితమైనదా ? మున్నగు వాటిని వారికుమారులు ఈ "భారతీ" మూలమున దేశమునకుఁ దెలుపుచు, లేఖామూలమున నాకుఁ బ్రత్యేకముగఁ దెలుపఁ గోరుచున్నాను.

సకలవిషయ సంపన్నమైనను కాకున్నను ఈ "బృహదమరకోశము" చాల యేండ్లనుంచి కాదు మొదటినుండి అప్రఖ్యాతమైనదిగనే యున్నది. కావుననే పలువురు పండితు లీయమరకోశమునకు "అమరశేష" మనుపేర శేషగ్రంథములను రచించుట జరుగుచున్నది. నేనుకూడా ఒక ''అమరశేషము''ను రచించినవాఁడనే. ఈ నా ''అమరశేష'' రచనాగాథ నిట సంగ్రహముగఁ దెల్పుకొనుచున్నాను. నాకు పదియేండ్ల యీడు వచ్చులోపల అమరకోశము ఆఖ్యాతచంద్రికయు టీకల [అర్థముల] తోడను, శ్రీరామాయణ సంగ్రహము, భోజ చంపువు, భోజచరిత్రము, విక్రమార్కచరిత్రము నర్థసహితముగ చదివి కాఁగా మాతండ్రిగారు సుప్రసిద్ధ విద్వాంసులు కీ.శే. శ్రీమాన్ కళత్తూరు విక్రాల రామచంద్రాచార్యులవారు

అమరకోశములో చెప్పక విడచిన విషయము [పేళ్ల]లకు రెండేసి, మూడేసి పేళ్లను పట్టికగ వ్రాసి మేము [శిష్యులము] చదువు కొనుట కివ్వఁగా నే నాపట్టికను చదివి శ్లోకములుగ రచించితిని. దానిని వారు, నాకు చదువు చెప్పుచున్న మా మాతామహులు షట్ఛాస్త్ర పండితులునైన శ్రీమాన్ పర్ణశాల రాఘవాచార్యుల వారును చూచి అటనట కొంఁదిగ సరి దిద్ది అది యొక పూర్వ గ్రంథమునకు శేష మనియు, రచయితనైన నాపేరు స్ఫురించు లాగునను దానికి 2 శేష నిఘంటు వని పేరిడిరి. ఇదినా ''అమర శేష'' రచనా చరిత్ర సంక్షేపము. ఇందలి మంగళాచరణాది శ్లోక ములు కొన్ని 1980 ఏప్రిల్ నెల భారతియందు ప్రచురింపఁబడిన ''అమరశేషము - త్రికాండశేషము" అను వ్యాసములో వ్రాసి యున్నాను.

అమరకోశములో చెప్పినపేళ్లలో మఱికొన్నిపేళ్ళు, అమర కోశములో బొత్తిగ చెప్పని కొఱవి బూడిదె కొఱుచిచ్చు మున్నగు వాఁటిపేళ్ళు అధికపాఠములలో చెప్పఁబడియున్నవి. ఈయధికపాఠ ములు వెనుకటి పండితులు ఆ గ్రంథములు వ్రాసుకొను నప్పుడు ఇవ్విషయ మీతావున నుండవలెనని రచియించి చేర్చినవి. కావున నవి యన్నియు నన్నిగ్రంథములలో నుండవు. ఉదా:- ఒక్క చెన్న పట్టణము [మద్రాస్] లోనే యచ్చైన అమరకోశములోని వాల్మీకి- వ్యాసుడు మున్నగాఁగల కొన్ని పేళ్లను నుడివెడు అధికపాఠములు అచ్చటనే వావిళ్లవా రచ్చువేసిన అమరకోశములోలేవు. వావిళ్లవారే అచ్చువేసిన గురుబాలప్రబోధిక [అమరకోశ విస్తృతటీక] లోని ''గోచి" మున్నగు పేళ్లను వాకొనెడు అధికపాఠములు వారే అచ్చువేసిన సటీక అమరకోశములో లేవు. కావున నధికపాఠము లన్నికోశములలో నుండవు.

---

ఈమాటలోని అక్షేపము :—

1 అమరసింహుఁ డమరకోశములో నిట్లు చెప్పలేదు. "శ్లో॥ సమాహృత్యాఽన్య తంత్రాణి.... ఇత్యాదిగ నితరులు(పెద్దలు) చేసిన కోశములను ప్రోగుచేసి(చదివి) (నే) నామలింగానుశాసనమును చేయుచున్నా ననియే చెప్పెను. కాని తాను తొలుత రచించిన పెద్ద నిఘంటువులో బాలబోధార్థము కొన్ని యంశములను తొలిగించి నామలింగానుశాసనమును చేయుచున్నా ననలేదు. మఱియు తాళ్ల పాక పెదతిరుమలాచార్య విరచిత ''గురుబాల ప్రబోధికా"ది అమరకోశ వ్యాఖ్యాన గ్రంథములలోను, రామాయణ రఘువంశాది గ్రంథములకు పూర్వపండితులు గోవిందరాజ - మల్లినాథాదు లొనర్చిన వ్యాఖ్యానములలోను "అమరకోశ" - "అమరశేష" శ్లోక ములే యుదాహృతములైనవి. కాని బృహ దమరకోశములోని శ్లోకము లెందును నుదాహరింపఁబడి లేవు. ఒకవేళ పూర్వు లుదాహ రించిన అమరకోశ శ్లోకములు బృహదమరకోశములోనివే యను కొనినను ఆ శ్లోకము లిప్పటి అమరకోశములోనివి యగుటయు, ఆ యుదాహరణములలో "బృహదమరకోశః" అని వాకొనుటయు గమనించఁ దగినది.

ఒకవేళ "బృహదమరకోశ" ముండి లభించుచో లభించి నంతవరకే అమరకోశమునకు మాదిరి తెనుఁగుటీకను వ్రాసి ప్రచు రించినచో చాల ఉపయోగకరముగ నుండును.

2 నా రచించిన అమరశేషము (శేషనిఘంటువు) లోని విష యములను, అమరకోశములోని విషయములనుఁ గలిపి ఏవిషయ మెందలిదియో తెలియుటకొఱకు అమరకోశములోనిదానికి అ. కో. అనియు, నా అమరశేషములోనిదానికి అ. శే. అనియు సంకేతాక్ష రల నునచి అమరకోశమునకు నారచించుచున్న విషయ సూచికను చూచినచో అమరకోశ పరిత్యక్త విషయములు తెలియఁగలవు.

అమరశేష మేకవి రచించినదియైనను ఆంధ్రటీకతోడఁగాని లేక మూలము మాత్రమే కాని ఎట్లు ముద్రితమైయున్నను అడ్రస్ తోడ తెలుపఁ గోరుచున్నాను. ముఖ్యముగ బృహదమరకోశ విష యమును ఆంధ్రశబ్ద రత్నాకరకారుల కుమారులను తెలుప వేడు చున్నాను—

— విల్లకా శేషాచార్యులు
కలికివాయి పోస్టు
(వయా) సింగరాయకొండ
ప్రకాశం జిల్లా



# ముక్తకములు

## శ్రీ తుమ్మల సీతారామమూర్తి

సీతవంటి పరమపూత చరిత్రకే
చెప్పరానినింద తప్పదాయె
ఎఱుకలేనివార లీర్ష్యామలీమసుల్
వేచియుందు రొరుల నేచుపనికి.

బుడుతతో వచ్చుచున్నది పడఁతి బాట ;
నాపె కెదురయ్యె నుగ్రపంచాననంబు ;
తల్లి తద్వ్యక్త్రమునఁ దూఱి తనయు మనిచె;
నెంతచాగము నైనఁ జేయించుఁ బ్రేమ.

దాఁచినసత్య మడంగక
యేఁచున్ బలువగల దోషి నెన్నఁటికైనన్
శోచిన్సు తన్ను ముడిచిన
నీచుం గాల్పక క్షమించునే శీతలమై.

తాలుతప్పుల నవలికిం ద్రోలిత్రోలి
గట్టిగింజలఁ జేట చేపట్టుకరణి
ద్రాబలను మెల్ల వెడలించి తగినవారి
దిద్దితీర్చు వివేకియౌ దేశికుండు.

మనుజుఁ డొగ్గవలయు మంచిపనికి; నింత
మేలిచేఁత కుద్యమించు నదను
మరల రాదటన్న మదితోడ నిర్భర
శ్రద్ధతోడ దానిఁ జలుపవలయు.

ఏనికైనను వినిపింపరాని తలఁపు
మదికి రానీఁడు మహనీయ మానవుండు
పాడిదప్పక పెఱవానిబాగు వలచి
స్రగ్గునతఁడు సదా తనలగ్గు మఱచి.

తనకాళ్లమీఁద నిల్చుట
మనుజుఁడు నేర్వంగవలయు, మాన్యులబ్రదుకుల్
కనవలయు నొరుల కింపగు
పనులైనను బూనరాదు పదియింటిఁ దలన్.

తమతేజమును బయస్సును
సమతం బాటించి రవియు జలదముఁ బంచున్
క్షమలేనివారు "మా, మీ"
సమరమ్మున నలఁగుచుంద్రు జగ మాలిగొనన్.

తేటగుల్కెడి జడినీరు చౌటినేల
నంటిన నపేయ మగురీతి ననఘమైన
బ్రహ్మవిద్య దురాత్ములపాలఁ బడిన
వికృతమై సత్యమును వికావికలుసేయు.

లోకమెల్ల నీశ్వరాకృతి యని నమ్మి
వగచు నార్తమైన జగముఁ జూచి
విశ్వసేవనమ్మ వేల్పునూడిగముగా
భక్తుఁ డాచరించి ముక్తి గాంచు.

విశ్వమునకునెల్ల వెలుఁగిచ్చు రవి నొక
పేఁచుమబ్బు కప్పివైచుకరణిఁ
గాననీదు మాయ కడుఁబిన్న మునుఁ గయ్యు
నిందు నందు నెందు నెసఁగు హరిని.

కల వసంఖ్యాత శాస్త్రముల్; కానఁదగిన
దెంతయో కల; దాయు వత్యంతచపల;
మంచ నీటిని వదలి పా లానుకరణి
నెఱుఁగవలయును మోక్షార్థి యెఱుకనిగ్గు.



# గూడూరు శాసన పునర్విమర్శ

శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి

తెలుగుదేశ చరిత్రలో పదవ శతాబ్ది నాటి కొంత సమాచారాన్ని కొరవి శాసము. గూడూరు శాసనముల నుండి మాత్రమే మనము తెలుసుకొన గలుగుచుంటిమి. ఆశాసనాలు రెండు ఎంత ముఖ్యమైనవో అర్థమగుటలో నంత జటిలమైనవి కూడ. క్రిందటి సంచికలో కొరవిశాసనాన్ని గూర్చి ముదిగొండ చాలుక్యుల చరిత్రకు ముఖ్యమైనదని కొంత వ్రాసితిని. ప్రస్తుతమీవ్యాసములో గూడూరు శాసన ప్రాముఖ్యాన్ని వ్రాయిదును. దీనిని గూర్చి డా॥ సి. సోమసుందరరావు, శ్రీ కొల్లూరు సూర్యనారాయణగారు కలిసి యొక ఆంగ్లవిమర్శక వ్యాసమును గత డిశంబరులో గుంటూరులో జరిగిన ఆం. ప్ర. హిస్టరీ కాంగ్రెసులో జదివిరి. నేను లోగడ 'ది కాకతీయాస్' అను పుస్తకంలో చేసిన కొన్ని నిర్ణయములను వారు తమ వ్యాసములో ఖండించుచు క్రొత్త అభిప్రాయములను ధ్రువపరచిరి. కొరవిశానన విమర్శయందువలెనే యీ శాసన విమర్శయందుకూడ వారు తామేర్పాటు గావించుకొన్న పురుషాంతరము ఒకటికి 25 సంవత్సరముల వ్యవధి ననుసరించి దాని కనుగుణముగ చరిత్రను సరిపెట్ట యత్నించిరి. ఆది యెంత మటుకు అంగీకారయోగ్యమైనదో విచారించవలసియున్నది.

త్రిభువనమల్లుడను బిరుదము వహించిన చాలుక్యచక్రవర్తి యగు ఆరవ విక్రమాదిత్యుడు రాజ్యము చేయుచుండగా నతనిపెద్ద కుమారుడును యువరాజునునైన కుమార సోమేశ్వరుడు తను కొల్లిపాక 7000 రాష్ట్రమునకు మహామండలేశ్వరుడుగ నున్నపుడు క్రీ.శ. 1124 లో ఈ గూడూరు శాసనము వేయించబడెను. గూడూరు గ్రామము జనగామ తాలూకాలో బమ్మెర, వేల్పుగొండల సమీపములోగలదు. శాసనము వేయించినవాడు కుమార సోమేశ్వరుని దండనాయకుడైన స్వామి దండాధిపతి (సావిపయ్య) క్రిందనున్న విరియాల మల్లనాయకుడు. ఇతడు తనపేర మల్లేశ్వరాలయము నిర్మించి, శివలింగ ప్రతిష్ఠచేసి, తటాకమును, బావిని త్రవ్వించినట్లిందుగలదు. శాసన స్తంభము నలువైపుల శాసనము వ్రాయబడియున్నది. మొదటి మూడు పైపులా కన్నడ గద్య పద్యాత్మకము. నాలుగవప్రక్క తెలుగు పద్యములు. ఈ శాసన ప్రాముఖ్యము గమనించి సుమారేబదేండ్ల నుండి పలువురు విద్వాంసులు దీనిని గూర్చి అప్పుడపుడు లభ్యమగుచు వచ్చిన ఆధారాంతరములతో సమన్వయ బఱచుచు వ్రాయుచుండిరి. చాలుక్య చక్రవర్తి యగు త్రిభువనమల్ల ఆరవ విక్రమాదిత్యుని ప్రశస్తియు, నతని కొడుకగు కుమార సోమేశ్వరుని ప్రశస్తియు తదుపరి యతని ప్రధానియు కొల్లిపాక రాష్ట్ర దండనాయకుడునైన స్వామివయ్య విన్నపము జేయగ కుమారసోమేశ్వరుడు గుడుదూరులో మల్లననాయకుడు ప్రతిష్ఠించిన మల్లేశ్వరుని అంగరంగభోగ నైవేద్యాదులకు వేల్పుగొండ (జఫర్ ఘడ్) క్రిందనుండు 24 గ్రామాలలోని పెదబమ్మరను ధారాపూర్వకముగ దానమొనర్చినట్లు మొదటి రెండు వైపులగల కన్నడ శాసనము తెలుపును. మూడవ వైపునగల కన్నడ పద్యములు విరియాల సూరడు, అతని కొడుకు చేతన, అతని కొడుకగు మల్లనయు గీర్తింపబడి, యీ మల్లన తనపేర శివాలయ ప్రతిష్ఠాదు లొనరించినట్లు చెప్పబడెను. రెండవ వైపునసే శాసనకాలము చాలుక్య విక్రమ వర్షము 49 క్రోధి సంవత్సర పుష్య బహుళ పాడ్యమి బుధవారమని చెప్పబడెను. ఈ తేది సరిగా క్రీ. శ. 1124, డిసెంబరు 24వ తేది యగుచున్నది. మూడవవైపున కన్నడ భాగామునకంతమున శాసనోక్తమైన ధర్మోల్లంఘనము చేయువారు పాప భాజనులగుదురని అభిశాప వాక్యములు గలవు. దీని నాధారముగ ప్రధాన శాసనము దీనితో పూర్తియగుచున్నది. గనుక నాలుగవ ప్రక్కనున్న తెలుగు శాసనమునకు దీనితో సంబంధములేదని కొందరు లోగడ చెప్పుచూవచ్చిరి. అంతేగాక తెలుగు పద్యములున్న భాగము కన్నడ శాసనకాలమునకు బూర్వమే రాతిపైన జెక్కబడినదనియు ఆ పద్యములు నన్నయకు బూర్వపువనికూడ సూచించిరి. కాని యీ యభిప్రాయ మంగీకరించ వీలుగాకున్నది. మొత్తము నలువైపుల అక్షరములొకే విధముగ నుండుటవలన వాటి నంటిని నొకేవ్యక్తి మలిచియుండునని నిశ్చయముగ తెలియుచున్నది. ఆ విషయము 'కామ్మో జనబరహ' అని కన్నడ భాషలో తెలుగు భాగము చివరనే కలదు. మఱియు ఈ తెలుగు భాగమును వ్రాయించిన కర్తపేరు లేదు. తుదిలో 'డపఅగట్టు' దేవరకుంజను' అని అమల్లేశ్వరునికి అడపగట్టును దానమొనర్చినట్లు గలదు. మల్లేశ్వరుడు ప్రతిష్ఠించబడియుండినకదా యీదానము చెల్లునది. అడపగట్టునుగూర్చి తరువాత వివరించుదును. కనుక క్రీ. శ. 1124 నాటిశాసనకాలానికి పూర్వము నాటిదీ తెలుగు

భాగమని చెప్పవలనుపడదు. ఇందు జెప్పబడినవారుకూడ విరియాల వంశమువారే. వారు క్రీ. శ. 1124 నాటి మల్లనకు తరువాత వార నుటకు తగిన ఆధారమింతవరకేదియు కానరాదు. విరియాలవారి కొందరి ఘనతను జెప్పుట తప్ప యీ తెలుగు భాగములో శాస నములకుండవలసిన యితర లక్షణము లేవియుగానరావు. తుది యందలి 'అడవగట్టు దేవరకుంజను' అను దానవాక్యము మూడవ ప్రక్కనగల కన్నడ పద్యములలోని మల్లనదిగనే భావించుట సమంజసము. ఆశాసనమందలి మూడు, నాలుగు ప్రక్కల మూల మిట్లుగలదు.

మూడవ ప్రక్క (కన్నడము)

వృత్త॥ విరియాలాన్వయ నీరజాకర దినేశం నిష్కళంకక్షీరసా
గర సంకాశ విశుద్ధకీర్తిన్ కనకాద్రీంద్రో న్నతం వందిసా
శిరసిష్టేష్ట కవీంద్ర కీర సహకారం వైరిగంధేభకే
సరిమిక్కుం విభుసూర సున్నత గుణోదారం ధరాచక్ర
దొళు॥ 1.

కంద॥ అతన తనెయం వినెయవి
నూతం భువన ప్రసిద్ధ కీర్తిన్ లతావి
ఖ్యాతం సజ్జన జనతా
ప్రీతం జేతణ సుదార సురభూజాతం ॥ 2.

అవన మనో నయన ప్రియె
భువన జనస్తుత చరిత్రె సద్గుణగణ సం
భవజన్మ భూమి సజ్జన
యువతీ రత్నమెనె బెజ్జమాంబికె నెగళ్దళు ॥ 3.

ఆరవ [ణీ] నిధానగం
వారవధూనిధిగ మఖిళ సద్గుణ నిళయం
వీరారిదర్ప దళనం
వీరాగ్రణి మెనిసి మల్లనుద్భవమాద ॥ 4.

వృత్త॥ ఇదె హేమాద్రీంద్ర మత్యుంన్నతియ మహిమెయిం దెంబి
నంతో ర్కెవెత్తిం
తిదెకల్పోర్వీరుహం విశ్రిత వితరణసామర్థ్యదిందెంబినం తా
నిదె దుగ్ధాంభోధి గంభీరతె యతిశయిదిం దెంచినం
మిక్కుకణ్గొ
ప్పిదపం భాస్వత్సుధాసుందర విశదయశం మల్ల నీధాత్రి
గెల్లం ॥ 5.

సాశ్వత పుణ్యపుంజ నఖిలార్థి సురావనిజాత సున్నతా
నశ్వరకీర్తిన్ సద్గుణగణాభరణం ఘనబాహు విక్రమం
విశ్వధరాతళం పొగళె మాడిసిదం గుముడూ రొళెద్య మ
ల్లేశ్వరమం తటాక ఘనవాపిగళం విభుమల్లనూర్జిత[ం] 6

ధరెయుం సుర్యాద్రియుం సా
గరముం చంద్రార్కరుం మహేశ్వరరుం ది
క్కరి చయము ముళ్ళ [నె] ం సుఖ
మిరుక్కం మల్ల కవీంద్ర బృంద మం పొరెయుత్తం॥ 7.

శ్లో॥ స్వదత్తాం పరదాత్తాంవా యోహరేత వసున్ధరాం ।
షష్టిం వర్ష సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమి ॥
వనే వనతరో వహ్నిర్దహన్మూలాని రక్షతి ।
కులం సమూలందహతి దేవస్వం హరతిపాతకః ॥
.......................... ॥నమః శివాయ॥

ఈ కన్నడ పద్యములలో మొదటి దానియందు విరియాలా న్వయమందు సూరడు జన్మించెనని చెప్పబడెను. అతని తండ్రి పేర్కొనబడలేదు. రెండవ పద్యములో ఆసూరని కొడుకు చేతన యని పేర్కొనబడెను. మూడవ పద్యములో ఆచేతని భార్య బెజ్జమాంబిక కీర్తించబడెను, నాల్గవ పద్యములో వారి పుత్రుడు మల్లడు చెప్పబడెను. అయిదవ వృత్తములో నతని ఘనత కీర్తించ బడెను, ఆరవ దానిలో నతడు గుముడూరులో మల్లేశ్వరదేవుని బ్రతిష్ఠించి తటాకమును గొప్ప బావిని త్రవ్వించినట్లు చెప్పబడెను. ఆతరువాత శాసనాంతములందుండు సామాన్య సంస్కృత శ్లోక ములు గలవు. 'నమఃశివాయ' తో ఈ మూడవవైపు ముగియు చున్నది. ఈ భాగమువలన విరియాలమల్లన తను చేసిన మల్లేశ్వర ప్రతిష్ఠాదుల నుద్దేశించి యీ శాసనమును వేయించెననియు, అందు ముందు రెండువైపుల తన స్వామియగు స్వామిదండాధిపుని దాన మును, రాజగు చాలుక్య విక్రమాదిత్యుని, అతని పుత్రుడగు కుమార సోమేశ్వరుని ప్రశంసించెను. ఇందు విరియాల మల్లన తండ్రి చేతన యనియు, తాత సూరన యనియు బేర్కొనబడిరి. అంతకు పూర్వులు జెప్పబడలేదు. శాసనాంతములందుండు సాధా రణ 'స్వదత్తాంపరదత్తాం' ఇత్యాది శ్లోకములనుబట్టి శాసన మింత టితో పూర్తియైనట్లు కనుపించుచున్నది. కాని అట్లుకాదు. నాలుగవ వైపును పరిశీలింతము. ఇది తెలుగు పద్యములలోనున్నది.

నాలుగవవైపు (తెలుగు పద్యములు)

1. చ. అనుపమ దుర్జయాన్వయ సుధాబ్ధి ననేకులు రాజనందనులు
జనిన బొలంటి వెన్నడను సంభవు డయ్యె నతిప్రసిద్ధుడై

వినుత విరోధి మణ్ణలిక వెన్నడు వెన్నుడైవోలె వానికిని
ఘనుడగునె (ట్టి) భూపతి జగద్వినుతుండుదయించె గీ ర్తిన్
తోను॥

2. ఉ. భావిత కీ ర్తిన్ నాథ[ని కి]పాండవ మధ్యమ భీముడో యనం
గావిరియాలు భీమ నిపఘస్మరుడై [యు]దియించె వానికిను
భూవినుతుండు మండలికభూషనుడె[ట్టి]నరేంద్రుడు [ త్త]మ
శ్రీవినుతుండు బంధుజనసేవ్యుండు దానుదయించెనున్నతిని॥

3. చ. అతణ్డని బొట్టుచేత వసుధాధిపుజేకొని వానిపై[రి]ను
ద్ధ్రితమున జంపి యకొ[క్కొ]రవిదేశమునందు ప్రతిష్ఠ
సేసి త
త్తనెయురు పేరు పొడగల దాయము బిట్టబి గద్యనంబున
ప్రతిముడు వాని[చే] మొగడు పల్లియు పండ్రిడు నేలు
నప్పుడే॥

4. చ. అరుదగునట్టెఎబన్రిపు [న]ంగనగామవసానియొక(క్క)మె
ల్గ (య్గ) రుడని చేత భూవిభుని గాకతివల్లభు చిన్నవాని దా
బరగగ జేతబట్టె ఘనుబల్లవరాయ నియోగి జొచ్చి భా
స్కరవిభు చక్రవర్తిన్‌గని కాకతినిల్పుట గోటి సేయదే॥

5. ఉ. కారకకాలుడై పడసె గాడయనాయకు జంపి సూరడ
వ్వేలుపుగొండ రవ్వనిన్రిపు వేలుపుగొండన నిల్పి వానిచే
మేలుగ మూడ పుప్పయిని మేలుగనేరెడు బోటిపాడునుం
పేలుగబేకు(క్క) మావిడ్లు మేలుగరెండెయరాజు సంగడ్లు
[డుల్] ॥

[గద్య] సూత్రధారి కొమ్మోజన బరహ శ్రీశ్రీశ్రీ
అడపగట్టు దేవరకు జను ॥

శాసన మింతటితో పూర్తియగుచున్నది.

ఈ యైదు తెలుగు వృత్తములకు వెనుకటి విరియాలమల్లని కన్నడపద్యములతోగలసంబంధ మెట్టిదో తెలుపబడలేదు. ఈతెలుగు పద్యములు కూడ వెనుకటి కన్నడశాసన రచయితయే రచించెనని తోచును.'తనయుడు' అనుటకు 'తనెయురు' అని [3వ పద్యములో], అదే పద్యములో నచటనే ప్రాస భంగము, అయిదవ పద్యములో 'కాలకకాలు' దనుటకు 'కారకకాలు' దనుట, తుదిలో 'సూత్రధారి కొమ్మోజన బరహ' అని కన్నడములో సూత్రధారి కొమ్మోజు యొక్క వ్రాత అని చెప్పుట మొదలగు వాటినిబట్టి తెలుగు కన్నడ ములు నేర్చిన రచయిత యొకడే యీ శాసనమునంతను రచించె ననియు, ఒకే వ్రాయసగాడు మలిచెలిననియు జెప్పవచ్చును. అందు వలన ఈ తెలుగు పద్యములలో తప్పులనేకము గనుపించును కవిత్వముకూడ జెప్పదగినంత కావ్యలక్షణములు కలదికాదు. కనుక రచయిత ప్రామాణికుడైన విద్వాంసుడుకాడు. మనకు కావలసి నంతమటుకు చరిత్రాంశమునుగూడ తప్పులతో అస్పష్టముగ తన కున్న కొద్దిపాటి శక్తితో పద్యములందిరికించెను. మల్లన చెప్పిన చరిత్రాంశమునంతను తన కవితలో చేర్చలేకపోయెనని స్పష్టముగ దెలియుచున్నది. అందువల్ల మనమెన్ని సవరింపులు చేసికొన్నను సరియగు చరిత్రాంశము తెలియవచ్చుటలేదు. ఈ భాగమందు జెప్పబడిన కొందరి వ్యక్తుల పరస్పర బాంధవ్యము తెలుసు కొనుట కష్టమగుచున్నది.

మొదటి పద్యములో దుర్జయవంశమునందు పొఅంటి వెన్నడు అతనికి కొడుకు ఎఱ్ఱడు బేర్కొనబడిరి. వీరిరువురు విరియాల వంశము వారేనని యిప్పటి వఱకు తలంచు చుంటిమి. కాని 'విరియాల' అను వంశనామము రెండవపద్యములో 'విరియాల భీమ' యను చోటున గానవచ్చుచున్నది. కనుక మొదటి పద్యములోని వెన్నడు, ఎఱ్ఱడు విరియాల వంశమునకు జెందినవారే యని నిర్ధారించి చెప్పజాలము. పైగా వారు దుర్జయ వంశములోని వారట. విరియాల వారిది దుర్జయ వంశమని రూఢిగ మనకు తెలియదు. బయ్యారం శాసనాదులందు కాకతీయులది దుర్జయవంశమని తెలియు చున్నది. అందొక వెన్నడు మూల పురుషుడుగా అశాసనమందు 1వంశనామము లేకుండ మూలపురుషుడుగ మాత్రము కోలవెన్ను తామ్రశాసనములోను 2పేర్కొనబడెను. ఈకోలవెన్ను శాసనంలో విశేషించి యతడు 'పొరంటి వెన్న'డనియు, అతడు గణపతిదేవుని జనకుడనియు జెప్పబడెను. ఇచట జనకుడనగా వంశములోని మూలపురుషుడనియే గ్రహించ వలయును. ప్రస్తుత గూడూరు శాసనంలోని పొఅంటివెన్నడు దుర్జయ వంశములోని వాడుగ జెప్ప బడెను గనుకను, విరియాలవంశ ప్రసక్తి యీ మొదటి పద్యములో లేదు గనుకను ఈ వెన్నడు దుర్జయ వంశములోని కాకతీయ మూలపురుషుడగు పొరంటి వెన్నడేయగునని చెప్పవీలగుచున్నది. ఇతనికి ఎఱ్ఱడు కొడుకుగా జెప్పబడియున్నను కోలవెన్ను తామ్ర శాసనంలో గణపతిదేవునివలె అవెన్ననివంశములో జన్మించినవాడని మాత్రమే గ్రహించవచ్చును. మొదటి పద్యము కాకతీయులగూర్చి చెప్పుచో రెండవ పద్యమును సమన్వయ పరచుటకొంతకష్టమగును. అందు "భావితకీర్తి నాథ[నికి]పాండవ మధ్యమ భీముడోయనంగా విరియాల భీమన్రిపఘస్మరుడై యుదియించె" ఇచట '[నికి]' అను రెండక్షరములు శాసనము పగిలిపోవుటచే మనమూహించి చేర్చు కొన్నవి. కొందరు 'థ'ను'త'గ మార్చి 'నాతనికి' అని చదివిరి.

అపుడు 'భావితకీర్తిన్' యను దానిని 'భావితకీర్తి కలుగునట్లుగా' అని క్రియావిశేషణంగా సర్దుబాటు చేసుకొనవలెనేమో తెలియదు. ఇంతకు 'అతనికి' లేక 'నాథనికి' లేక 'నాథునికి' అనునని [నికి] అను నష్టమైన అక్షరములు రెండింటిని పూరించు కొన్నపుడే కుదురును. అట్లు షష్ఠ్యంతముగా పూరించుకొనుటవలననే మొదటి పద్యమునకు రెండవ పద్యముతో సంబంధ మేర్పడుచున్నది. అషష్ఠ్యంత పూరణము చేయకున్నచో ఆ రెండు పద్యములకు సంబంధ ముండదు. వీటిలో నైదవ పద్యములో నెట్టి సంబంధం తెలుపకుండగనే యొక సూరని ఘనత చెప్పబడింది. అట్లే మొదటి పద్యమునకు రెండవ పద్యముతో సంబంధము లేకుండక పోవచ్చును. అప్పుడు మనము 'భావితకీర్తినాథ [డిటు],' లేక 'భావితకీర్తినాథ [డిటు]' లేక మరొక విధంగానో పూరించు కొన్నచో రెండవ పద్యమునుండియే విరియాల వారి వంశము వర్ణించబడినట్లగును. మొదటి పద్యములోని వెన్నడు, ఎఱ్ఱడు కాకతీయులే యగుదురు. విరియాల వంశము రెండవ పద్యములోని భీముడితో ప్రారంభమగును. మనము పూరించుకొన్న [ఇటు] అను దానికి, కాకతీయ వంశములో ఎఱ్ఱడు ప్రసిద్ధుడైయుండగ ఇటు విరియాల వంశములో భీముడు నృపఘస్మరుడై యుదయించెనని అర్థము చెప్పవలెను, లేదా 'భావితకీర్తినాథ[నికి]' అంటే కాకతీయ యెఱ్ఱనికి శత్రునృపఘస్మరుడైన విరియాల భీముడు ఉపసామంతముగ సహాయపడుచుండెనని అర్థము చెప్పవలెను. మొదటినుండియు విరియాలవారు కాకతీయులకు బంధువులుగను, ఆప్తులుగను ఉండుటనుబట్టి, శాసనకాలమగు క్రీ. శ. 1124 నాటికి కాకతి రెండవ ప్రోలుడు గూడూరుకి ప్రక్కనే యనుమకొండలో బలవంతుడగు మహామండలేశ్వరుడుగ నుండుటనుబట్టి వారి వంశమును ప్రశంసించుట విరియాల మల్లనికి అసంగతము కానేరదు. తరువాత పద్యమొకదానిలో 'కాకతినిల్పుట కోటిసేయదే' అని కాకతివంశము నిలబెట్టుట తామకొక ఘనతగ జెప్పుకొనిరి. కనుక విరియాలభీముడు భావితకీర్తినాథుడైన కాకతి యెఱ్ఱనకు శత్రునృపఘస్మరుడై సంభవించెను. పుత్రుడుగా కాదు. దండనాయకుడుగనో, ప్రధానిగనో తోడ్పడెనని చెప్పవలెను. అట్టి భీమన తన కొడుకైనట్టి విరియాల యెఱ్ఱనకు కాకతి యెఱ్ఱన యొక్క మనుమరాలినో పుత్రునో వివాహముచేసికొని యుండును. ఈ బాంధవ్యమునకు స్పష్టముగ గూడూరు శాసనంలో తెలియకున్నను సిద్ధేశ్వర చరిత్రాది కథనము వలన నూహించుటకు వీలగుచున్నది. ఈయెఱ్ఱనయే కొరవిదేశములో స్థిరపడిన మొదటి కాకతీయుడు. అప్పటినుండి తాము కాకతీయుల కాప్తులుగ నుంటిమని చెప్పుటకే విరియాల భీమునితో వంశ ప్రశస్తి చెప్పబడెను. కాని క్రీ.శ. 973 లో రాష్ట్రకూట పతనానంతరము కాకతియెఱ్ఱని మనుమడైన పిండిగుండరాజు (నాల్గవ గుండన) క్రొత్తగవచ్చిన చాలుక్య యిమ్మడి తైలపుని యధికారమునకు లోబడక స్వతంత్రుడై యుండునని తోచును. దానికిష్టపడక, విరియాల భీముని కొడుకగు ఎఱ్ఱన నూతన చక్రవర్తికనుకూలుడై కొరవిలో మొదటనున్న ముదిగొండ చాలుక్యుల సంతతివాడైన బొట్టుబేతరాజును నిలబెట్టి రాజకీయముగ బలుకుబడి సంపాదించెను. ఈ సందర్భముననే ముదిగొండ బేతరాజుకు శత్రువైన కాకతి గుండనను యుద్ధములో జంపియుండును. కాని గూడూరు శాసనం నాటికి కాకతీయులు మరల ప్రబలులై తమకు స్వాములై యుండ విరియాలమల్లన తన మొత్తాతయొకడు యుద్ధములో కాకతి గుండనను జంపెనని స్పష్టముగ జెప్పక నొకానొక వైరిని అనిలో జంపెనని మాత్రము చెప్పెను. రాజకీయ తంత్రములలో బాంధవ్యములకు తావుండదు. కేంద్ర రాజకీయములు మారినప్పుడల్లా మాండలికులనేక విధములుగ తమ విధేయతను తారుమారు చేయుచుందురు. మొత్తముమీద చాలుక్యతైలప చక్రవర్తి విరియాల యెఱ్ఱనచేత రాష్ట్రకూటాభిమానియై తన్నెదిర్చిన కాకతీయ గుండనను జంపించి కొరవిలో బొట్టుబేతరాజును స్థాపించెను. దీనివలన విరియాల యెఱ్ఱనకు రాజాభిమానము హెచ్చెను. ఇది మూడవ పద్యములోని కథనమునకు తాత్పర్యమని తోచుచున్నది.

నాలుగవ పద్యము. రాష్ట్రకూట పతనముతోబాటు కాకతీయ గుండనకూడ పతనము పొందెను. అప్పటికతని కొడుకు గరుడ బేతరాజు పిన్నవాడని యిందు జెప్పబడెను. విరియాల యెఱ్ఱనిభార్య కాకతీయుల యింటి పుత్రికని తోచుచున్నదని చెప్పితిని. తన పుట్టింటివారి అధికార మంతటితో నశించుచుండగా చూడలేక ఆమె (కామనసాని) రాజుతో పలుకుబడి సంపాదించిన తన భర్తయగు ఎఱ్ఱన ద్వారా చిన్నవాడైన కాకతి బేతరాజును రాజునకు పరిచయ మొనర్చి యనుమకొండ రాజ్యమిప్పించి కాకతి వంశమును తిరిగి యధికారము లోనిలబెట్టనని యిందలి భావము. కొరవిలో బొట్టు బేతరాజునుస్థాపించుటయు, వేరొకచోట నిస్సహాయుడైన గరుడను బేతరాజును నిలబెట్టి కాకతి వంశము పతనము జెందకుండ కాపాడుటయు విరియాల దంపతులుచేసిన ఘనకార్యములుగ మూడు, నాలుగు పద్యములలో కీర్తింపబడెను. ఈ సందర్భమున కాలనిర్ణయముచేయుచు ఈ రెండు సంఘటనలు సుమారు క్రీ. శ. 1060 ప్రాంతంములో జరిగియుండునని నేను చెప్పితిని.[3] అంతేకాక బొట్టు బేతరాజును గుర్తించుచు క్రివ్వకశాసనంలో పేర్కొనబడిన వారుకాక ఆ ముదిగొండ చాలుక్యవంశములో మఱికొందరుండి యుందురనియు, ఆ పేర్కొనబడిన వారిలో గూడూరు శాసనబొట్టు

బేతరాజొకడై యుండునని కూడ చెప్పితిని.[4] అట్లే యిందున్న కాకతిబేతరాజు గరుడ బేతరాజనికూడ జెప్పితిని.

నేను చేసిన పై మూడభిప్రాయములతో నేకీభవించక డా. సి. సోమసుందరరావుగారు, శ్రీ కొల్లూరు సూర్యనారాయణ గారు ఇటీవల గుంటూరులో జరిగిన ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెసులో నొక పరిశోధక పత్రిముజదివిరి. ఆ పత్రములోనివారి నిర్ణయములు వారు భారతిలో ప్రకటించిన 'ముదిగొండచాళుక్యులు' అను వ్యాసములోని నిర్ణయములకు విరుద్ధముగా నున్నవి.[5] ఈ వ్యాసములో వీరు గూడూరు శాసనంలోని బొట్టు బేతరాజునకు నేను చేసినట్లే సుమారు క్రీ. త. 985-1000గా కాలము నిర్ణయించి తదనుగుణముగా కాలక్రమ పట్టికలో ఆ బేతరాజున కొక ప్రత్యేక స్థానమొసగిరి. కాని గుంటూరులో జదివిన పరిశోధక పత్రములో పైనిర్ణయమును త్రోసిపుచ్చుచు గూడూరు శాసనోక్తములైన సంఘటనలను క్రీ. త. సుమారు 1075-1100 కు మార్చి అందలి బొట్టుబేతరాజు క్రివ్వక శాసనంలోని మొదటి బేతరాజునియు, అట్లే కాకతిబేతరాజు సుమారు క్రీ. త. 1076 నుండి 1108 వరకు పాలించిన త్రిభువనమల్ల రెండవబేతరాజనియు తీర్మానించిరి. ఈ నిర్ణయముల సందర్భమున వారు కొన్ని ముఖ్యాంశములను ప్రోద్బలకముగ జూపిరి.

1. కాలక్రమము సరిపడదు.

2. కాకతి రెండవ బేతరాజునకు మంత్రియగు వైజ దండాధినాథుడు సహాయమొనర్చినట్లు చెప్పబడిన పద్మాక్షిగుడియొద్ద నున్న శాసనంలోని విషయము గూడూరు శాసనంలో కామవసాని చేసినట్లు చెప్పబడిన సహాయమునే సూచించుచున్నది. (అనగా నిరువురు చేసిన సహాయము ఒకే సందర్భమునగనుక, ఆ బేతరాజు కాకతి రెండవ బేతరాజనియే చెప్పవచ్చుననిరి)

3. గూడూరు శాసనంలో గరుడ బేతరాజు పేర్కొనబడనే లేదు. అచ్చటజెప్పబడినవాడు కాకతిబేతరాజు మాత్రమే. అందువల్ల నతనిని రెండవ బేతరాజు గజెప్పుకొనుటలో అభ్యంతరములేదు.

వారుచూపిన యీమూడు ప్రోద్బలకాంశములను పరిశీలించ వలసి యున్నది. వాటిలో మొదటిది, మూడవది ముఖ్యమైనవి కనుక ముందు వాటిని గూర్చి చెప్పుదును.

1. కాలక్రమము సరిపడదు - అను ఆక్షేపము.

అంటే వారనుకొన్న క్రివ్వకశాసనంలోని మొదటి (బొట్టు) బేతరాజుకాలం కుదరదని వారి అభిప్రాయం. అట్లు కుదరకపోవుట చేతనే నేను వేరొక బేతరాజును ఆ ముదిగొండ వంశావళిలో కల్పించితినని వారి యాక్షేపము. ఆ యాక్షేపము నిజమైనదే, కాని నేనట్లు కల్పించుటకు సాధకములు గలవు. విరియాల భీముడు కాకతి యెఱ్ఱనికి వయసున చిన్నవాడైన సమకాలికుడు కాదగును. అంటే సుమారు క్రీ. త. 970 ప్రాంతము వరకు జీవించి యుండును. అతని కొడుకు విరియాల యెఱ్ఱన క్రీ. త. 995-1000 నడుమనొక వైరిని (కాకతి గుండనను) జంపి కొరవిలో బొట్టుబేతని ప్రతిష్ఠించెను. ఈ గుండన కాకతి యెఱ్ఱనకు మనుమడు. ఈ యోచన గూడూరు శాసనంలోని మొదటి పద్యము కాకతీయ వెన్ననను, ఏఱ్ఱనను చెప్పుచున్నదను నిర్ణయముపై నాధారపడియున్నది. అదెట్లు సంభవమగునో ముందు చెప్పియుంటిని. అది అంగీకార యోగ్యముకాదని వాదించుచో మఱొకవిధముగా కాలక్రమాన్ని సరిచూడవలయును.

3. గరుడ బేతరాజు పేర్కొనబడలేదను ఆక్షేపము. నాలుగవ పద్యములోని యుదంతము చూతము.

"ఎఱ్ఱనృపునంగన కామసానయొక్క మేల్గరుడని బేత భూవి భునికాకతి వల్లభు బిన్నవాని....కాకతి నిల్పుట గోటిసేయదే" ఈ భాగములో గరుడబేతని ప్రసక్తియే కానరాదని వారివాదము. 'కామవసాని యొక్క మేలుగ, రుడని, బేతభూవిభుని' అను పదవిభాగమును వారు చెప్పవలసియుండును. అపుడు మధ్యనున్న 'రుడని' అనుపదమునిరర్థకముకాగలదు. శాసనశిలలో 'మేల్గరుడని' అనుచోట పగిలిపోవుటచేత 'మెయ్గరుడని' అని చదువుట యుక్త మని తోచుచున్నది. 'ఒక్క-మెయి = ఒకవిధముగ' అని అర్థము చెప్పుచో 'మేలుగ+రుడని' వలెగాక పదవిశ్లేషము 'మెయి+గరుడని' అనయేయగును. 'మేలు' అనియాలేక 'మేలుగ' అనియా యను సంశయమునకు తావుండదు. గరుడపదము సందేహము నకు తావులేకుండ సిద్ధించును. 'రుడని' అను నిరర్థక పదముండదు. కాని మఱొక యనుపపత్తిగలదు. ఇచట 'గరుడ' అనునది ప్రాతి పదిక. దానితత్సమ ప్రథమైకవచనము 'గరుడుండు' అని కావలెను. కాని కేవలము 'గరుడు' అనికాదు. అట్లయినపుడు కాదా 'గరుడు+ అని' కలిసి 'గరుడని' బేతభూవిభుడు కుదురుట. నిజమునకు 'గరుడుండని' బేతభూవిభుడు కావలెను. కాని మన గూడూరుశాసన రచయిత ప్రాతిపదికను యథాతథముగ. 'డు'ఁ అంతము చేయకయే తెలుగులో ప్రయోగించుట కలదు. ఈ శాసనంలోనే రెండవ పద్యములో 'పాండవమధ్యమ భీముడో యనంగా విరియాల భీమ నృపుడు సన్నరుడై యుదియించె'అని విరియాలభీముడు నృపుడు సన్నరుడై యుదయించెననుటకు బదులు 'విరియాలభీమ' అని ప్రాతిపదికనే

ప్రథమైకవచనాంతముగ ప్రయోగించెను. అట్లుకానిచో పాండవ మధ్యమ భీమునితో పోలికకూడ కుదురదు. అదేవిధముగ 'గరు డుండు' అని డుమంత ప్రయోగము చేయక 'గరుడ' అని ప్రాతి పదికనే వాడుచు 'అని' అను తెలుగు అవ్యయంతో సంధిచేసి (గరుడ+అని) 'గరుడని' అనే రూపమువాడెను. అయిదవ పద్య ములోగూడ 'మేలు గరెండెయరాజు సంగడుల్' అని తన కన్నడ సంస్కారములో 'గరుడయ' పదమును వాడెను. (గరుడ+అయ్య) కనుక డాక్టరు సోమసుందరరావుగారు, కొల్లారు సూర్యనారాయణ గారు చేసిన గూడూరు శాసనంలో గరుడ బేతరాజు పేర్కొనబడ లేదను మూడవ ఆక్షేపము నిలువజాలదు. గరుడ బేతరాజు రెండు తావులలో పేర్కొనబడెను. నాలుగవ పద్యములో 'గరుడని బేత రాజు' అనియు, అయిదవ పద్యములో 'గరెండెయరాజు' అనియు ప్రయోగించబడెను. బయ్యారం చెఱువు శాసనం కనుగొనబడిన తర్వాతనే గూడూరు శాసనంలోని యీ రెండు ప్రయోగములు 'గరుడబేతరాజు' నుద్దేశించి చేయబడినవని తెలిసికొంటిమి. ఆపేరు కాకతి మొదటి బేతరాజునకే కానిరెండవ బేతరాజుకున్నట్లు కనుపించదు.

2వ అంశము – వైజదండాధినాధుడు సహాయ మొనర్చినది కాకతి రెండవ బేతరాజునకు గనుక నదియే కామవసాని చేసిన సందర్భమని గూడూరు శాసనములో గీర్తింపబడి యుండును–అనునది.

అనుమకొండ పద్మాక్షిగుడి ముందున్న కాకతి రెండవ ప్రోలుని క్రీ. శ. 1117 నాటి శాసనములో వైజదండాధి నాధుడు కాకతి రెండవ బేతరాజునకు సహాయ మొనర్చినట్లు వర్ణించబడెను. అందలి కన్నడ పద్యమిట్లున్నది.

వృత్త॥ అగణిత శౌర్యదిం నెగళ్ద కాకతి బేత నరేంద్రనం జగం
పొగళె చాళుక్య చక్రి చరణంసలె కాణిసి తత్ప్రసాదదిం
బగెగొళ సబ్బిసాయిర మనాళిసి దుగ్ధ యశోధి నాధనం
పొగళదరారొ మండళిక కాకతి బేతన మంత్రి వైజన॥

ఈ పద్యములో వైజనమంత్రి కాకతి బేత నరేంద్రుని చాళుక్య చక్రవర్తి యనుగ్రహమునకు పాత్రునిగజేసి సబ్బి సహస్రమండలము నేలునట్లొనర్చెనని కలదు. శనిగారం శాస నాలను బట్టి సబ్బిమండలములో కొంత భాగము కాకతి మొదటి బేతరాజు కాలమునుండి వారి యనుమకొండ విషయముతోబాటు తమక్రిందనే యున్నట్లు తెలియుచున్నది. కాని క్రీ. శ. 1053 నాటి మొదటి ప్రోలుని శనిగారం శాసనం [6] తర్వాత 1107 నాటి యచటి రెండవ బేతని శాసనంవరకు సుమారొక అర్ధశతాబ్దికి పైగా సబ్బిమండలంలో 'కాకతీయుల పాలన యున్నట్లు తెలుపు శాస' నాధారము లేదు. పైగా ఈ చెప్పిన క్రీ. శ. 1107 నాటి రెండవ బేతని శాసనంలో (పరమార) జగద్దేవరసుని దండనాయకుడగు కొండపయ్య చేసిన దానము చెప్పబడెను.[7] దీనినిబట్టి జగద్దేవరసు నుండి యీ భాగమును తిరిగి రెండవ బేతరాజు పొందెనా యను సందేహము కలుగుచున్నది. సబ్బిమండలానికి రాజధానియైన వేములవాడలోకూడ నీ జగద్దేవుని శాసనమొకటి అదే సంవత్సరము నాటిది కలదు.[8] ఈ యాధారముల బట్టి పరమార జగద్దేవునితో కాకతీయులకు వైరమేర్పడి అందుమూలమున సబ్బి సహస్ర మండలముపై నాధిపత్యములో మార్పులు వచ్చియుండునని తెలియు చున్నది. ఈ సందర్భమున వైజనమంత్రి కాకతి రెండవ బేత రాజును చాళుక్య చక్రవర్తి యొద్దకు గొనిపోయి సబ్బిమండలమును కాకతీయుల రాజ్యములో జేర్పించెనని తోచును. ఇది గూడూరు శాసనంలో జెప్పబడిన కాకతి వంశము నిలుపుట కాజాలదు. కాకతి రాజులప్పటికి అనుమకొండలో సుస్థిరముగ నుండిరి. మొదటి బేతరాజు కాలములోనే వారు అనుమకొండ జేరినట్లు మనకు బయ్యారం చెఱువు శాసనంవలన తెలియుచున్నది. అప్పుడే కాకతి వంశము పతనముగాకుండ నిలబెట్టవలసిన పరిస్థితి యేర్పడెను. రెండవ బేతరాజు కాలంలో వచ్చిన దట్టి వంశమును నిలబెట్టవలసి నంత క్లిష్టపరిస్థితి కాదు. సబ్బి సహస్ర మండలాన్ని అనుమకొండ విషయంతోబాటు కాకతి రాజ్యంలో జేర్పించుట మాత్రమే. ఈ సందర్భమున బొట్టు బేతరాజునకు సంబంధమేలేదు. వాని రాజ్యము కొరవిప్రాంతము. కనుక గూడూరు శాసనంలో పేర్కొనబడిన బేతరాజు కాకతి మొదటి బేతరాజేకాని రెండవ బేతరాజు కాజాలడు. ఆ (మొదటి) బేతరాజే యందు గరుడని బేతరాజని స్పష్టంగ పేర్కొనబడెను. విరియాల దంపతు లీ బేతరాజునే రాజ్యమిప్పించి నిలబెట్టిరి. ఈ పరిస్థితి గరుడ బేతరాజు పిన్నవయస్కుడై యున్నపుడు సంభవించినట్లుకూడ నచట జెప్పబడెను. క్రీ. శ. 995 ప్రాంతములోనే గరుడబేతరాజు చిన్నవాడుగ నుండుట, రాజ్యము, తండ్రి పోవుట మనకు తెలియుచున్నది. రెండవ బేతరాజున కీ పరిస్థితులున్నట్లు మనకు తెలియుటలేదు.

క్రీ. శ. 995–1000 ప్రాంతములో ముదిగొండ చాలుక్యుల వంశములో బేతరాజెవరు కనుపించుటలేదు. కాలక్రమ నిర్ణయం పైవిధంగా తప్పనిసరి యయ్యెను. కనుక క్రివ్వక శాసనంలో జెప్ప బడిన ముదిగొండ చాలుక్యులేగాక మఱికొందరుండి యుందురని నేను చెప్పవలసి వచ్చెను. శ్రీయుతులు సోమసుందరరావుగారు,

సూర్యనారాయణగారు కాలక్రమనిర్ణయాన్నేర్పాటు చేసుకొని చరిత్రను మార్చ యత్నించుచుండిరి. నేను చరిత్రాంశాన్ని తదను గుణమైన కాలక్రమ నిర్ణయాన్నిచేయ యత్నించుచు ఆ ముదిగొండ చాలుక్యులలో క్రివ్వకశాసనంలోని వారు గాక కనీసం మఱియొక బొట్టుబేతరాజుండి యుండునని యూహించి చెప్పతిని. తమ గత జనవరి నెల భారతిలో వారుకూడ నా యభిప్రాయముతో నేకీభ వించుచు వేరొక బొట్టు బేతరాజును కల్పించిరి. కాని వారు గుంటూరు సభలో చదివిన ఆంగ్ల వ్యాసములో మార్పు చేయుటకు వారికి లభించిన నూతనాధారము లేవో వారు తెలుపలేదు. వారు చేసిన కాలక్రమ నిర్ణయము పురుషాంతర మొకటికి 20 లేక 25 సంవత్సరముల వ్యవధి నిచ్చుచు మెకానికల్ పద్ధతిలో చేయ బడినది. ఆ విధానములో చరిత్రాంశము లన్ని కలిసివచ్చుట లేదని నే నా విధానము ననుసరించ లేదు. కాలక్రమము కుదురదని చేసిన ఆక్షేపమునకు పై జెప్పిన దంతయు సమాధానము కాగలదు.

గూడూరు శాసనంలో అయిదవ పద్యములో కొన్ని చరిత్రాంశములు జెప్పబడెను. కాని యవి సులభముగా బోధపడుట లేదు. ఇందొక సూరడు వర్ణించబడెను. ఆ సూరనికి పై జెప్పబడ్డ విరియాల యెఱ్ఱన, కామవసానికి గల సంబంధముగాని, మూడవ వైపున కన్నడభాగములోని మొదటి పద్యమునందు జెప్పబడిన విరియాల సూరనతోగల సంబంధముగాని చెప్పబడలేదు, అయినను క్రమముననుసరించి విరియాల యెఱ్ఱన-కామవసాని దంపతుల కీతడు పుత్రుడై యుండుననిచెప్పుచుంటిమి. దాని కనుగుణముగ నీ సూరడు గరెండెయరాజు యొక్క సంగడులు (స్నేహములు) సంపాదించి నట్లు చెప్పబడెను. గరెండెయరాజు, గరుడబేతరాజనియు, అతడే కాకతి మొదటి బేతరాజనియు చెప్పియుంటిమి కనుక నీ యైదవ పద్యములోని సూరడు విరియాల యఱ్ఱన-కామవసాని దంపతుల పుత్రుడని యూహించుటలో బాధకములేదు. కన్నడ పద్యములోని సూరడు శాసనము వేయించిన విరియాల మల్లనకు తాత. కనుక శాసనకాలమగు క్రీ. శ. 1124 నుండి సుమారేబదేండ్లు ముందు వాడని చెప్పవచ్చును. అంటే క్రీ. శ. 1075 ప్రాంతమువాడు. డా॥ సోమసుందరరావుగారు, వారి మిత్రులుకూడ నిట్లే నిర్ణయించిరి. కాని యీ కన్నడ పద్యములోని సూరడు, తెలుగు పద్యములోని సూరడు ఒకరేయని నిర్ణయించగల ఆధారమేదియులేదు. శాసనము వేయించిన మల్లన తన పూర్వుల కొందరి ఘనతను తెలుగు పద్యములలో విడిగా వ్రాయించెనేకాని వారు తనకెంతటి పూర్వులో జెప్పలేదు. ఆ పూర్వుల ఘనతకూడ కాకతీయులు తెలుగుదేశములో స్థిరపడిన నాటినుండి తమకు వారితో గల సన్నిహితత్వమును వ్యక్తము చేయుటకొఱకే యుద్దేశించబడెను. అందుచేతనే ముందు దుర్జయవంశములో వెన్నడు పుట్టెననియు, అతని సంతతిలో నెఱ్ఱడు విరియాల భీముడు తోడ్పడిన మొదటి కాకతీయుడుగ వర్ణించబడెను. ఆ తరువాత విరియాల యెఱ్ఱన-కామవసానులు గరుడ బేతరాజుకు చేసిన సహాయము ఆ తరువాత నొకసూరడా బేతరాజునకు సంగడి కాడగుట యీ తెలుగు పద్యములు వ్రాయించుటలో నుద్దేశమై యుండెను. కన్నడ పద్యములలో కాకతీయుల ప్రసక్తియే కానరాదు. కనుక రెండు భాగములలోని సూరనలు భిన్న వ్యక్తులైనను కావచ్చును.

ఈ యైదవ తెలుగు పద్యములో రెండు విషయములు చెప్ప బడెను. ఒక కాటయ నాయకుని చంపి సూరడు వేలుపుకొండ (ఇప్పటి జఫర్ ఘడ్) సాధించెను. ఆ వేలుపుకొండలో నొక రవ్వ నృపుని నిలిపెనట. ఈ రవ్వనృపు డెవరో తెలియదు. మిత్రులు కీర్తిశేషులు శ్రీ కొల్లూరు హర్షవర్ధనశర్మగారు ఈ గూడూరు శాసనమును విపుల వివరణముతో 1962-63 లో ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిలో ప్రకటించుచు ననేక నూతనాంశముల జేర్చిరి. అప్పటికి బయ్యారం శాసనము, క్రివ్వకశాసనము వెలువడకుండుట చేత వారి నిర్ణయములు కొన్ని మనము మార్చుకొన వలసి యున్నను, కొన్ని స్వీకరించ దగి యున్నవి. వారీ పద్యములోని రవ్వనృపుని కాకతీయ మొదటి బేతరాజై యుండునని యూహించిరి. వారి యూహ నట్లే యిప్పటికిని గ్రహించవలసియున్నది. ఆ రవ్వ నృపుని గుర్తించు ఆధారాంతరము లభించలేదు. మొదటి బేతరాజు నకే వేల్పుకొండ దుర్గమునుకూడ సాధించి ఆసూరడొసగియున్నను కావచ్చును. అట్లు సహాయ మొనర్చి వాని మెప్పునొంది మూడ ముప్పయి, నేరెడు బోటిపాడు, పెక్కు మావిండ్లు బహుమానముగ బొందెనట. అంతేగాక. గరెడెయరాజు సంగడికూడ సంపాదించెనట. కనుక కాకతి గరుడ బేతరాజే అప్పటికి పిన్నవయసువాడు గనుక రవ్వనృపుడని చెప్పబడియుండునని వారట్లూహించిరి. రాష్ట్రకూటుల నాడు వేలుపుకొండ యొక దుర్గస్థానము. కాకతీయుల నాడంత ప్రసిద్ధిలో లేకున్నను ముసల్మానుల కాలములో నచట జఫరుద్దౌలా యను వాడాదుర్గమును పునర్నిర్మించి బలపఱచెను. మొదటి కాటయ నాయకుని జంపి సూరడు దానిని రవ్వనృపుని కిచ్చుట ప్రాచీన చరిత్రగనే తోచుచున్నది. కాకతి రెండవ బేతరాజు నాటికి అనుమ కొండ సమీపములోనున్న యీ వేల్పుకొండను వేరొక నాయకుడు దురాక్రమణముచేసి యుండునని చెప్పజాలము. ఈ భాగము అనుమ కొండ విషయములో జేరినదై యుండును. మొదటి బేతరాజు అనుమకొండతోబాటు తత్ప్రాంతమునందున్న వేలుపుకొండనుకూడ సంపాదించుటలో సూరడు తోడ్పడియుండు ననుటయే యుక్తమని పించును. ఈ సూరడు కన్నడ పద్యములో విరియాల మల్లనికి

తాతగా జెప్పబడిన సూరడుకన్న కాలములో కొంత ముందువాడని తోచుచున్నది. గూడూరు శాసనంలోని సూరనలు ఇద్దరా, ఒకరా అను సంశయ మిట్లుండగా, కటుకూరు శాసనంలో మఱొక సూరన కీర్తించబడెను.

క్రీ. శ. 1205 నాడు విరియాల వారింటి కూతురు మల్యాల చౌండసేనాని భార్యయైన మైలమాంబ కటుకూరులో నొక పెద్ద శాసనము వేయించెను.[9] అందామె తన పుట్టింటి వారిని అత్తింటి వారిని ప్రస్తుతించుకొనుచు, తన తండ్రి, తాతల వంశము నిట్లు చెప్పుకొనెను.




క్రీ.శ. 1205 నాటి మైలాంబ తాతయైన మల్లన క్రీ. శ. 1124 నాటిగూడురు శాసనంవేయించిన వాడను కొనుటలో బాధకమంతగా లేదు. కాని ఆ మల్లని తాతయగు సూరననుగూర్చి కొంత సందేహముకలదు. ఈ కటుకూరు శాసనము అతని ఘనతనిట్లు వర్ణించుచున్నది.

శ్లో॥ యదాహవే వీరనరేంద్ర ఘస్మరే
శరప్రలూనారి శిరస్సమావృతే ।
పలాయనా ద్భీమనృపేణరక్షితః
కథంచి దాత్మా క్షణ జీవితాశయా ॥

వీర నరేంద్రులను హతమార్చుచున్నట్టియు, బాణములతో ఖండించబడిన శత్రువుల శిరస్సులతో నిండినట్టి యెవని (సూరని) రణరంగమునుండి క్షణికమగు జీవితమందుగల ఆశతో అతికష్టమున పాఱిపోవుట ద్వారా భీమనృపునిచేత ప్రాణము రక్షించుకొనబడెను. మైలాంబ తన తండ్రి, తాతల గొప్పతనము నేమాత్రము చెప్పకుండ నామమాత్రముగ గ్రహించుచు దూరముగ తాతకు తాతయైన ఈ సూరని ఘనతను మాత్రమే కీర్తించుటనుబట్టి యతడావంశములో మిగిలిన చెప్పబడినవారి కన్నగొప్ప వ్యక్తియని స్పష్టమగుచున్నది. ఇతని శత్రువుగా వర్ణించబడిన భీమనృపుడెవ్వడో వానితో నితడెవరి పక్షమున యుద్ధముచేసి పాఱదోలెనో తెలియుటలేదు. క్రీ. శ. 1124 నాటి మల్లనకీ సూరడు తాతగా చెప్పబడెను. అప్పటి కేబదేండ్లకు పూర్వము అనగా క్రీ. శ. 1075–6లో చాలుక్యభువనైక మల్ల రెండవ సోమేశ్వరుని పదభ్రష్టుని జేయుటకై యతని తమ్ముడు త్రిభువన మల్ల ఆరవ విక్రమాదిత్యుడు సామంతుల నందరను తన పక్షమునకు జేర్చుకొనుచుండెను. ఆ సామంతులలో తెలంగాణములో తెలుగు చోడవంశమునకు జెందిన రెండవచోడ భీముడు విక్రమాదిత్యుని పక్షమున నిలిచి యతనికి విజయము సాధించి చాలుక్య సింహాసన మిప్పించుటలో తోడ్పడెను. అందుకు ప్రతిఫలముగా రాజు కందూరుమండలము నా భీమచోడునికి శాశ్వత సామంత మండలముగ దయచేసినట్లు పానుగల్లు శాసన మొకటి తెలుపుచున్నది. కాని ఆ భీముడు విరియాల సూరనికి భయపడి యుద్ధరంగమునుండి పాఱిపోవునంతటి బలహీనుడుకాదు. పైగా విక్రమాదిత్యునికి రాజ్యమిప్పించి మెప్పుపొందినవాడు. సూరని శత్రు వా భీమచోడుడే యగుచో సూరడు భువనైక మల్ల సోమేశ్వరుని పక్షమున విక్రమాదిత్యునికి ప్రతిపక్షమున పోరుసలిపె ననవలెను. అట్టి శత్రువు యొక్క ప్రశంస విక్రమాదిత్యుని రాజ్యకాలంలో వాని కుమారునిచే వేయించబడిన యీ గూడూరు శాసనములో చేయబడుట అసంభవము. ఒకవేళ మల్లనను మన్నించి తిరిగి తమకొలువులో జేర్చుకొన్నను తాతయగు సూరన పేరు వ్రాయించ నీయరు. కనుక కటుకూరు శాసనంలోని సూరని శత్రువగు భీమనృపుడు భీమచోడుడు కాజాలడు. వేరొక భీముని గుర్తించుట కష్టమగుచున్నది. కటుకూరు శాసనంలో ఎన్నడో గడిచిన యీ సూరని విజయము సమీప కాలంలో వేయించబడిన గూడూరు శాసనంలో తెలుగు భాగములో కాని, కన్నడ భాగములో కాని ప్రశంసించ బడకుండుట విచిత్రముగా తోచుచున్నది. కనుక కటుకూరు శాసనంలో సూరనను, గూడూరు శాసనంలో కీర్తించ బడిన యే సూరనగా గుర్తించవలెనో తెలియుట లేదు. ఈ సంశయాలు దృష్టిలోబెట్టుకొని నేను విరియాలవారి వంశ క్రమమును గాని కాలక్రమమును గాని స్పష్టముగా తెలుపజాలక పోతిని.[10] గూడూరు శాసనంలో వారిని, కటుకూరు శాసనంలోని వారిని వేరువేరుగా జూపితిని. డా॥ సి. సోమసుందరరావు గారు, వారి మిత్రులు చూపిన విధంగా పురుషాంతరానికి 25 సంవత్సరాలు చొప్పున యిస్తూ చూపుట కష్టమైన పనికాదు

శ్రీ హర్షవర్ధనశర్మగారు గూడూరు శాసనం ప్రకటించినది మొదలు ఈ సందేహములు తొలగించుటకై యత్నించుచుంటిని. అది నా కింతవఱకు కుదురలేదు. అయినను వారు తమ ప్రణాళికను ముందుగ ప్రకటించిరి గనుక కనీసం సందేహములనైన వెలిబుచ్చుట మంచి దని యిది వ్రాసితిని.

గూడూరు శాసనంలో ఇంకనూ సరిగా తెలియని అంశములు.

1. త త్తనెయురు పేరు పొడగలదాయము. (మూడవ తెలుగు పద్యములో) విరియాల యెఱ్ఱన బొట్టుబేతనికి సహాయముచేసి వాన్నిని కొరవిలో ప్రతిష్టించి నందుకు వానినుండి బహుమానముగ పొందిన దిది. ఆ బొట్టు బేతని యొక్క తనయుని పేరు చాయగల సంతతిని పొందెనని చెప్పుచో విరియాల యెఱ్ఱన కొడుకు పేరుగాని, మనుమని పేరుగాని బొట్టుబేతని కొడుకు పేరును బోలియుండ వలెను. ఈ యర్థము సరిపోవునో లేదో తెలియదు.

2. బి ట్టఱ గద్యనంబు, (మూడవ పద్యములో) బిట్టు+అర గద్యనంబు. అర్ధగద్యాణములు బహుమతిగా పొందెనని చెప్పుటలో తాత్పర్యములేదు. చాల అర్ధ గద్యాణములు తన పేర ముద్రించుకొని రాజ్యములో వాడ వచ్చుననెడి యనుజ్ఞ నొందెనని చెప్పవలెనేమో. పూర్వము రాజులు తమ కుపకారము చేసిన సామంతులకు, ఉద్యోగులకు తమ రాజ నామములను, బిరుదులను వారు పెట్టుకొనుట కనుమతించువారు. అట్లే వారికి కొన్ని నాణెములను ముద్రించుకొను అధికారము గూడ నొసగి తమ కృతజ్ఞతను దెలుపువారు. ఈ యభిప్రాయము సరియై నదో కానిదో తెలియదు.

3. భాస్కర విభు చక్రవర్తి (నాలుగవ పద్యము). దీనికి సరియగు అర్థము తెలియదు. 'భాస్కరనిభు' అని కొందరు దిద్ది సూర్యసన్నిభుడగు చక్రవర్తియని అర్థము జెప్పిరి. శ్రీ శర్మగారు భాస్కర అనగా సూరడని చెప్పిరి. కాని విరియాల సూరడికి చక్రవర్తి పదవి లేదు.

4. రవ్వనృపుడు- (అయిదవ పద్యములో). ఇతడెవరో సరిగా గుర్తించుట వీలుగాకున్నది.

5. అడప గట్టు దేవరకు ఇను. (తుదిలోని వాక్యము.) ఈ వాక్యము చాలకాల మర్థమయ్యెడిది కాదు. 'తాంబూలము దేవునికి చెందును' అని విరియాల మల్లన దేవుని కిచ్చెనని చెప్పితే చాలదు. ఒక తాంబూలమిస్తే దేవుని కే భోగము జరుగుతుందో, దాని విలువెంతో తెలుపవలె కదా. అదిలేదు. ఇటీవల కొండవర్తిలో ప్రాచీన తెలుగు శాసన మొకటి కనుగొనబడెను.[11] అందు అన్మకొండలోని జైనులకు చెందిన భూమి నొకదానిని ఆ గ్రామపెద్ద వ్యవసాయమునకై రైతునకు కట్టుబడి కిచ్చును. ఆ సందర్భమున ఆ గ్రామ పెద్ద భూమివారిచేతను, రైతుచేతను తాంబూలము లిప్పించి కట్టుబాటు చేయించును. దీనినిబట్టి పూర్వము గ్రామాల్లో ఏ కట్టుబొట్లు జరిగినా ఆగ్రామ పెద్దల సమక్షంలో తాంబూలము పుచ్చుకొని దానికి బద్ధులైయుండు వారని అర్థమగు చున్నది. అందెట్టి లోపము జరిగినను గ్రామ పెద్ద ఆ తగవును తీర్చువాడు. ఇప్పటికి మనము వివాహాదులందు గ్రామ కట్నమనబడు తాంబూలమును ప్రత్యేకించి గ్రామ పెద్దలకు ఇచ్చెదము. ఇచట కూడ గూడూరులో గ్రామ పెద్దయైన విరియాల మల్లనకు ముట్టెడి గ్రామ కట్నము నంతను అతడు తను ప్రతిష్ఠించిన మల్లేశ్వరదేవుని పూజా నైవేద్యాది కైంకర్యమునకై వినియోగ పడునట్లు దానము చేసెనని యీ తుది వాక్యమున కర్థము చెప్పవలెను. ఈ తాంబూలములతో వివాహాలకెంతయో, భూమి కౌలున కెంతయో, ఇతర క్రయవిక్రయాది సందర్భములకెంతయో ఆయా గ్రామాల్లో నిర్ణీతమైన విలువ డబ్బు రూపములో చెల్లించువారు. అట్టి డబ్బునకు అడప గట్టు అనిపేరు. ఇది గ్రామసభకు ఆదాయము. ఈ ధనము పొందినందుకు ఆ గ్రామ పెద్దలు ఆయా కట్టుబొట్లలో లోపము జరుగకుండ బాధ్యత వహించువారు. ఏపక్షమువారైనను ఆ కట్టుబాటును అతిక్రమించినచో వారిని శిక్షించుఅధికారము గ్రామ సభ కుండెడిది. పూర్వకాలంలో న్యాయస్థానా లుండెడివి కాదు. ఉన్నను రాజుల సమక్షములో తాత్కాలికంగా నొక న్యాయ సభ యేర్పాటు చేయబడి కొన్ని నేరములను విచారించు వారు. ప్రతి గ్రామంలో జరిగే నేరాలను, అక్రమాలను, కట్టుబొట్లు మీరుటను ఆయా గ్రామ సభలే విచారించు

చుండెడివి. అందుకుగాను వారు 'అడపగట్టు' అనబడె పన్నును తాంబూలంతో వసూలు చేయువారు. ఇప్పుడు మనం కోర్టు స్టాంపులతో అగ్రిమెంట్లు, దస్తావేజులు వ్రాసు కొని వాటికి చట్టసమ్మతమైన భద్రతను కల్పించు చుంటిమి పూర్వం తాంబూలంతో కొంత డబ్బును గ్రామపెద్ద కొసగి ఆ కట్టుబాటునకు నైతిక భద్రతను కల్పించుకొనువారు.12.

విశేషాంశ సూచి

1. భారతి_1967, ఏప్రిల్_పుట 2 నుండి
2. భారతి - 1960, జూన్ -
   'శుభమస్తు |' గణపతి క్ష్మాపతిజనకో భువి విలసతిపొరంటి వెన్నభూపాలః'
3. పి. వి. పి. శాస్త్రి, ది కాకతీయాస్ (ఆంగ్లము), పుటలు 41, 42
4. ,, పుటలు 54, 55
5. భారతి_1981, జనవరి_పుటలు 63, 64
6. ఎపి. ఆం. IV, పుటలు 67_74
7. ,, పుటలు 74_80
8. భారతి_1971, నవంబరు, పు 11_13
9. తెలంగాణా శాసనములు_2, పు 127_130
10. పి. వి. పి. శాస్త్రి, ది కాకతీయాస్, పు 148_9
11. వరం. జి. శా., పుట 315
12. అడపగట్టును గూర్చి గత, డిసెంబరులో జరిగిన ఆం. ప్ర. హిస్టరీ కాంగ్రెసులో నే జదివిన ఆంగ్ల వ్యాసమున కిది సారాంశము.



# బైరాగి

## " సౌంధ్యశ్రీ "

వ్యంగ్యం అని యొకటి గలదు. స్ఫురణలో నొక చిత్రమైన ధ్వని యావేశించుటయు గలదు. ప్రముఖు లందరు ఏదో ఒకనాటికి చేరగల చింతనా వలయ మొకటి గలదు. ఇది తాత్వికము. ఇది నమ్మకమా, యన - తప్పని ఒక యపనమ్మకములోని నమ్మకమును - నమ్ముట. ఇట్టిది జరుగుటయూ అనుభవమే.

సోమరాజుపల్లి చెంచయ్యగార్కి నమస్కారము. (ఈనమస్కారమునకున్న సాంప్రదాయిక సంస్కారము. ఈ నమస్కారము కువిమర్శకు గురి యగుట మీరు భారతిలో లోగడ చదివియే యుందురు. నా నమస్క్రియను ఒక భారతి లేఖకుడు అతని శక్తిమేర, అతని సంస్కార బలిమిమేర గుణ విభజన చేసుకొనినాడు.)

బైరాగి నమ్మిన - లేక నడిచిన ఛాయను "అపనమ్మకపు నీడలో" యని నిర్వచించ ప్రయత్నించిన దాని కొక వ్యతిరేక వ్యంగ్య సమాధానము ; నా వ్రాయ బడిన 1×O=O. బైరాగి నైరాశ్యంలో పడిపోయాడని నే ననుకొని ఆ కవితను వ్రాయటం జరగలేదని మనవి. అన్వేషణలో నాకు దొరకని ఒక ఈ అపనమ్మకపు సత్యాన్ని బైరాగి కొన్నిచోట్ల నాకు చూపించాడు.

ఎవరైనా ఎప్పుడైనా తెలుసుకో దగింది సున్నా ! ఈ వలయం పూర్తిగా అర్థం కావటం కూడ సున్నాయే ! అపనమ్మకంలోని నమ్మక మంటే తాత్విక విచారం లోని ఒక దశ. (నాకు తెలిసినమేర) అంతేకాని ఒక కల్పనామయ అసత్యాన్ని ఆరాధించని బైరాగి కోసం మాత్రమే వ్రాసిన నా కవిత తొందరపాటు మాత్రమేకాదు - విడ్డూరంకూడా కాదని నా తాత్పర్యం.

# భూమి

## శ్రీ కె. శివారెడ్డి

లోపల
గ్లాసులు నిండి కళ్ళు పొర్లి పోతాయి
గ్లాసులోని కొవ్వొత్తి దీపం పీటకింద పిల్లికూనలా -
ఎత్తైన అంచుదాటి కిందకు దూకే నీళ్ళ కేశాల
గాలి కలవరింతలు.

మృగం సంచరించదు.
చెట్టుకింద పడుకుని కళ్ళు మూస్తూ తెరుస్తూ -
యుగయుగాల్నుంచి తను తయారు చేయదల్చుకున్న
పూర్ణాయుధం తయారీలో కొలిమి ముందు కూర్చున్న
కమ్మరి సముద్రుడు.

ఒక నీలిజ్వరకాంచి పరివ్యాప్తమై మాదకత నాశీర్వదిస్తూ-
పర్వతాలు ఘర్షించుకుంటూ వర్షించుకుంటూ
బీజం పొట్ట చీల్చుకు వస్తున్న అంకురం పాడే సంగీతం.

**Just**

ఒక కుక్కటూ, ఒక పందిటూ వెళ్ళిపోతాయి
పాతరాతి యుగపు పనిముట్లు దొరుకుతాయి.
రోమ్‌లో శిథిల యాంఫీ థియేటర్ విషాద కావ్యం
ముగుస్తుంది
శాంశన్ చేతులు నదులై అల్లుకుపోతాయి.

పల్లెటూళ్ళో కోడిగుడ్డు లాంతరు ముందు ఓ బాలుడు
తెల్లారగట్ట మినుకుమినుకుమంటూమినుకుతూనేవుంటాడు.

సాయంకాలాల గ్లాసుల సమూహాలన్నీ
పరస్పరం ముద్దిడుకుని పెదాల కత్తులమీద దూకేస్తాయి.
నల్లని బర్రెమీద నలనల్లని కుర్రాడు చేతిలో కర్రతో
అలానే చెరువులోకి దిగిపోతాడు.

ఎవడో పిలుస్తాడు - మరెవరో పలుకుతారు
స్టేషనంతా జనమయం - ఎక్కడిదో ఒంటరి కేక
జవాబులేని రాతికేక-శిఖరాగ్రంనుంచి నడిసముద్రంలోకి-
గంటలు మోయించుకుంటూ చెట్లు వెళతాయి
అసంఖ్యాక బాలవీరులు కవాతు చేసుకుంటూ కదనాని
కెళ్ళిపోతుంటారు.

గ్లాసులోంచి సముద్రమూ - సముద్రంలోంచి గ్లాసూ
ఉదయిస్తాయి
చేతుల్లోంచి రోడ్లూ రోడ్లలోంచి చేతులూ ఉదయిస్తాయి
నదుల్లోంచి పాదాలు పాదాల్లోంచి నదులూ పుట్టుకొస్తాయి
చీకట్లోంచి చెట్లూ, చెట్లలోంచి మనుషులూ,
మనుషుల్లోంచి మహామారుతాలూ -
కొండలు పుష్పాలై వికసిస్తున్నాయి - పుష్పాల్లోంచి
నేత్రాలు అసంఖ్యాకంగా ఆవిర్భవిస్తున్నాయి.

బావిలోంచి ఒక్కొక్క కడవా పైకొస్తుంది
ఆకాశంనుంచి ఒక్కొక్క చినుకే రాల్తుంది.

ఏరు ఎటు ఎటు తిరిగినా ప్రవహించటమే దాని ధ్యేయం
గాలి ఎటు ఎటు వీచినా బతికించటమే దాని ధ్యేయం
గాలి ఏరూ, ఏరుగాలీ మానవుని జీవలక్షణం తిరగబడటం.

గ్లాసునుంచి గ్లాసూ, రేకునుంచి రేకూ - రేపునుంచిరేపూ-
గ్లాసూ కొవ్వొత్తీ మృగమూ చెట్టూ సముద్రమూ
ఆకాశమూ కొండలూ అడవులూ అణువులూ
బీజాల జీవ చైతన్యమూ పొట్టలోంచి జన్మించే
కత్తులూ కొడవళ్ళూ కోడి కూతలూ - సమస్త కదలికల
సమస్త సంచలనాల పదాఘాతాల -
భూమి
కొత్త రూపం తీసుకుంటోంది
నా గర్భంలోంచి భూమి కొత్తగా జన్మిస్తోంది.



విహారి

# మినీ కవిత - ఒక దృక్పథం

తెలుగు కవితా రంగంలో ఇప్పుడు వీస్తున్నగాలి - మినీ కవిత. దీని గురించి ఇటీవల వ్యాఖ్యానాలూ, సమీక్షలూ విరివిగానే వెలువడుతున్నాయి.

కావ్యాలనుంచీ ఖండకావ్యాలూ, ఖండకావ్యాలనుంచి కవితా ఖండికలూ ఉద్భవించి, కవితా ఖండికనుంచీ మినీ కవిత వచ్చింది. ఇది కవితా రూపంలో వచ్చిన సహజమైన మార్పు. కనుక సంక్షిప్తత మినీ కవిత ముఖ్య లక్షణం. వీటినే కొందరు పొట్టి కవితలు అంటే బాగుంటుందనీ, మరి కొందరు చిన్ని కవితలు అనాలనీ అంటున్నారు. అయితే, మినీ కవిత అనేదే ఇప్పటికి కొంత ప్రచారంలోకి వచ్చింది.

సాహిత్యంలో- వస్తువు ఏదో వొక ప్రక్రియని ఆశ్రయించి బహిర్గత మౌతుంది. ప్రాచుర్యం దృష్ట్యా - ప్రక్రియ కాల ప్రవాహంలో ఉచ్ఛనీచాల్ని అనుభవిస్తూవుంటుంది. ఒక ప్రక్రియ ఆవిర్భావానికి కొన్ని కారణాలు వుండటం ఎంత సహజమో, ఆ ప్రక్రియ ఒక కాలంలో అధిక ప్రాచుర్యాన్ని పొందటానికి గానీ, నిరసింపబడటానికి గానీ -. కొన్ని పరిస్థితులు సహకరిస్తాయనేది అంతే యదార్థం.

మినీ కవిత ఆవిర్భావానికి ప్రధానమైన కారణాల్ని - శ్రీ అద్దేపల్లి రామమోహనరావుగారు - "మినీ కవిత - మరొక అవగాహన"-అన్న వ్యాసంలో చెప్పారు. వారు చెప్పిన కారణాల్ని విశ్లేషిస్తాను. 1. సాహిత్య ప్రక్రియల్లోని తతిమ్మా అన్ని ప్రక్రియల కన్నా కవితా రచన యువకుల్ని ఎక్కువగా ఆకర్షిస్తోంది. 2. ఆధునిక జనజీవనంలోని సంక్లిష్టత, సందిగ్ధత, అవ్యవస్థ, అయోమయం; మనిషి నిస్సహాయత, నిరాశ, నిస్పృహ - వీటిని నానాటికీ ఘనీభవింపచేస్తున్న సమాజ పరిస్థితులు - ప్రముఖంగా నిరుద్యోగం, ఆకలి, దోపిడీ, అవినీతి-ఇవన్నీ యువకుల మనసుల్ని చీకాకు పరుస్తున్నై; వారి గుండెల్ని తప్పెటలుగా మారుస్తున్నై; అక్కడ కోటికోట్ల శతఘ్నుల్ని పేరుస్తున్నై. ఇవన్నీ కలిసి సృష్టిస్తున్న లోలోపలి అలజడిని - అప్పటికప్పుడు బహిర్గతం చేయ డానికి-ఒక వాహిక కావలసివచ్చింది. 3. చాలా అంశాల్ని సమీక రించుకునీ, సమన్వయ పరచుకునీ మాత్రమే కవిత్వం రాయాలనీ, అది 'పూర్వజన్మ సుకృతం'వల్ల అబ్బే విద్య అనీ - అనిపించే స్థితి గతించింది. 4. వచన కవితని అనేక సాహిత్య సిద్ధాంతాలూ, రాజకీయ సిద్ధాంతాలూ, వ్యక్తిగత వాదాలూ కలిసి గజిబిజి చేసి పారేసినై. దాన్ని నలభై రోడ్ల కూడలిలో నిలబెట్టాయి. యువకు లకు ఏ బాట సుగమమైనదో, సజావైనదో తెలియని పరిస్థితి వచ్చే సింది. ఈ కారణాలన్నీ వాస్తవమైనవి.

అలాగే మినీకవిత ప్రాచుర్యానికి సహకరించిన పరిస్థితుల్ని గమనిస్తే - వాటిల్లో ప్రముఖంగా చెప్పుకోవలసినది - పత్రికల ఆదరణ, ప్రోత్సాహం. "కాలమ్" విలువ తెలిసిన సంపాదకులు పత్రికలో కవితలకి అతి తక్కువ జాగాని మాత్రమే కేటాయించ గలిగిన స్థితిలో పడ్డారు. దీన్ని యువకులు అందిపుచ్చుకున్నారు. ఈ వాస్తవం అర్థరహితమనే వాదన వొకటి వున్నది. "పత్రికలు అన్ని ప్రక్రియలకీ అవకాశం యిస్తాయి. ఈ ప్రక్రియలో ఏదో వో ప్రక్రియ ప్రజలందర్నీ ఆకర్షించి ఒక ఉధృతమైన రూపాన్ని పొందుతుంది. అప్పుడు దాని కారణం సమాజంలో వెతుక్కో వలసిందేకానీ పత్రికలే కారణ మనరాదు" అన్నారు శ్రీ అద్దేపల్లి.

ఇక్కడ ఒక్కమాట చెప్పాలి. నవలల పోటీలని పత్రికలే ప్రారంభించాయి. ఫలితాలు ఏ స్థితిలో వున్నదీ ఈనాడు మనం చూస్తున్నాం. ఇది నవలా యుగంగా మారింది. కార్టూలన్ ఒక ప్రక్రియగా చూడండి. పత్రికల ప్రోత్సాహమే వాటి ఉధృతికి కారణం కాదనగలమా? ఇవ్వాళ పత్రికల్లో నాటకాలూ నాటికలూ అంతగా కనపడటం లేదు. కారణం - రచయితలు నాటికలు రాయడం లేదనీ, పత్రికలకు పంపడం లేదనీ అనుకోలేము. ప్రతి సంవత్సరం అవి మంచి సంఖ్యలోనే విడిగా పుస్తక రూపేణా ప్రచురణ పొందుతున్నాయి. పరిషత్తుల పోటీలకి పోతున్నాయి. పోనీ, పాఠకుల నిరసన వున్నదా అంటే దీనికి దాఖలాలు లేవు. ప్రత్యేక సంచికల్లో నాటికలు వస్తూనే వున్నాయి. అలాగే, కథల గురించి ఒక్క విషయం చెప్తాను. ఒకప్పుడు భారతి పెద్ద కథల్ని ఆహ్వానించింది. ఒక వరుసలో ఎన్నోవచ్చినై. ఆంధ్రసచిత్రవార పత్రిక వొకే సంచికలో వొక పెద్ద కథనంతా వేయడం మొదలెట్టి పాఠకుల మన్ననల్ని పొందింది. శ్రీమతి సులోచనారాణిగారికి తొలిసారి అత్యధికమైన అభిమానాన్ని సంపాదించి పెట్టిన

"ఐలవ్యూ" కథ ఇందుకు ఉదాహరణ. "జ్యోతి" మాసపత్రికలో శ్రీమతి బీనాదేవిగారి "రాధమ్మ పెళ్ళి ఆగిపోయింది" మరో వుదాహరణ. ఈ కథకి వ్రాయబడిన ముందు మాటలు, పాఠకులమీద వాటి ప్రభావం, ఆ ప్రభావంవలన కలిగిన సంచలనం గమనార్హం. కనుక, అఘటన ఘటనా సమర్థత ; ఘటనా ఘటన సమర్థత – రెండూవున్న పత్రికలు– ఏ ప్రక్రియా ప్రాచుర్యానికైనా ఆయువు పట్టు అనే వాస్తవాన్ని అంగీకరించక తప్పదు. మినీకవితా ప్రాచుర్యానికి పత్రికల ప్రోత్సాహమే కారణం. ప్రత్యేకించి ఆంధ్ర జ్యోతి తీసుకున్న "లీడ్" ని పేర్కోవాలి. పైన ఉదహరించిన 'కాలమ్' విలువ వంటి – పత్రికల స్వార్థం వలన ఈ ప్రోత్సాహం మినీకవితకి compelling గా లభించడం ఒక accident అనుకోవచ్చు. మినీకవిత ప్రాచుర్యానికి మరో కారణం – దీన్ని విరివిగా వ్రాస్తున్నది యువకులు కావడమే. ఆవేశం, ఉత్సాహం ఉరకలు వేస్తున్న యువత రాశిని ఎక్కువ సృష్టించగలదు. రాశి ఆధిక్యత వలన ప్రచురణలో frequency కనిపిస్తోంది. ప్రచురణలో frequency పాఠకుల్లో ప్రాచుర్యాన్ని సంపాదించుకుంటోంది.

మినీకవిత తత్వాన్ని గురించిన చర్చ కూడా ఈమధ్య పత్రికల్లో వస్తున్నది. మినీకవిత తత్వం అంటే – కవితలో వస్తువు యొక్క స్వరూపం. మినీకవిత ఒక ప్రక్రియా విశేషం కనుక ప్రక్రియకు ఆధారభూతమైన వస్తువు గురించిన చర్చకూడా అవశ్యకమే. మినీకవితలోని వస్తువు వచన కవితా ఖండికలోని వస్తువుకు భిన్నమైనదని ఒక అభిప్రాయం వుంది. "మినీ కవితలో ఒక చమత్కృతి వున్నది, ఒక మెరపు వున్నది, ఒక మినీ భావ ప్రకాశంవున్నది" అంటున్నారు శ్రీ టి. యల్. కాంతారావు. "ఒకే ఒక్క భావాన్ని–దానికి సమగ్రమైన, బలమైన అభివ్యక్తినివ్వడంలో సూటిగా చెప్పడాన్నిగాక ధ్వని నాశ్రయించేది మినీకవిత .... కవితలోని ప్రతిపదమూ ఒక సమష్టి వ్యంగ్యంవైపు దారితియ్యక పోతే అది మినీకవిత కాదు" అంటారు శ్రీ అద్దేపల్లి.

అంటే, ఈ రెండు అభిప్రాయాల్నీ కలిపిచూస్తే – చమత్కృతి, మెరపు, మినీ భావ ప్రకాశం – ఇవన్నీ ధ్వని నాశ్రయించి వుంటే మినీకవిత అవుతుంది.

'బ్రెవిటీ, నేటివిటీ, ఇండివిడ్యువాలిటీ వున్న కవులు మినీ కవిత రాస్తున్నవాళ్ళు' అన్నారు శ్రీ ఎమ్వీయల్. కనుక 'నేటివిటీ'ని మరొక లక్షణంగా భావించాలి.

వీటి దృష్ట్యా కొన్ని మినీకవితల్ని పరిశీలిద్దాం.

కన్ను తెరిస్తే జననం
కన్ను మూస్తే మరణం
రెప్పపాటేకదా ప్రయాణం–అని శ్రీ చంద్రసేన్ మినీకవిత.

ఇందులో పై లక్షణాలన్నీ ఉండటమేగాక ఒక జీవనసత్యం ఆవిష్కృతమైంది. 'రెప్పపాటేగదా' అన్నపదం అంతకు ముందు రెండు పాదాల్లోనూ విశేష్యంగా. నిలిచిన 'కన్ను' క్రియాపరమైనది (చేసే పనికి సంబంధించినది) కావడంవలన అర్థస్ఫూర్తిని పెంపొందిస్తూ కవితని సమష్టి వ్యంగ్యం వైపు నడుపుతోంది.

అలాగే శ్రీ వివినమూర్తి "మార్పు" మినీకవిత—

నేటి ఫుట్‌పాత్‌లు
పూరి గుడిసెలే
రేపటి సూర్యుళ్ల
జన్మ స్థలాలు.

ఇక్కడ "సూర్యుళ్లు" "జన్మస్థలాలు" – సాభిప్రాయంగా ధ్వన్యాత్మకంగా వుండి భావ ప్రకాశాన్ని పఠితకు అందిస్తున్నాయి.

ఒకదశలో
ఆశవిన్నర్, నిరాశరన్నర్
మరోదశలో
నిరాశ విన్నర్, ఆశరన్నర్
కాలం అంపైర్.

ఇది శ్రీ తోలేటి రాంబాబు రచన. ఇందులో చివర కాలాన్ని 'అంపైర్' తో పోల్చడంవలన – 'విన్నర్' కీ 'రన్నర్' కీ బలం చేకూరింది. ఆశనిరాశల మధ్య ఊగిసలాడే మనిషి కాలం నిర్ణయించే ఫలితానికి తలవొగ్గక తప్పదనే భావం ధ్వనింప జేయబడింది. ఇందులో మరోవిశేషం – ఆధునికత. కవిఎన్నుకున్న "ఇమేజస్" పూర్తిగా ఆధునికమైనవి.

అయితే. వస్తుతత్వాన్ని చర్చించేటప్పుడు, కవితా ప్రయోజనాన్ని దృష్టిలో వుంచుకుని తీరాలి. కనుక, ఇలా – మినీభావ ప్రకాశం కలిగిన ఖండికలు–ధ్వని నాశ్రయించివుండి, చమత్కృతీ మెరపు సంతరించుకుని వుండి – సాధించగలిగిన ప్రయోజనం సంపూర్ణమైనదేనా అనేది చర్చించదగిన అంశం.

కవిత సమాజ పరిస్థితిని ప్రతిబింబించి, సామాన్యులలో తెలివిని పుట్టించాలి. వారిని మంచి కోవకి తిప్పాలి. ఇందుకోసం అది సులభగ్రాహ్యం కావాలి. ఎవరెన్ని విధాల వ్యాఖ్యానం చేసినా కవిత – లక్ష్యం, ధర్మం, ప్రయోజనం ఇదే. ఈ ప్రయోజన సిద్ధింపబడాలంటే– కవికి సామాజిక స్పృహ తప్పనిసరిగా కావాలి ఈనాటి వచన కవులంతా దీన్ని అంగీకరిస్తూనే వున్నారు. అయితే,

'ఏది సామాజిక స్పృహ?' ఈ పదం ఇవాళ అతివిశాలమై అతినీరసమై పోయింది. కుండీలోని గులాబీ మొక్కని వర్ణించడమే ఒకరికి సామాజిక స్పృహగా తోస్తూవుంటే, ధనవంతుడైన ప్రతివాడూ, వాడి యింట్లో పనిచేసే ఆడదాన్ని చెరచడమే శాస్త్రీయమైన అవగాహనతో కూడిన సామాజిక స్పృహగా మరికొందరికి గోచరిస్తోంది. దేశ, మాతని కీర్తించడమే మరికొందరికి సామాజిక స్పృహ. అంటే. ఆలోచనల్లో అర్థాన్ని అన్వయించుకోవడంలో – ఇంతటి అంతరం, కనిపిస్తోంది. ఇది ఇలా వుండగా – అసలీ సామాజికస్పృహ అనేదే అర్థరహితమైనది అంటూ – కవిత ప్రయోజనాన్ని అనుభూతి ప్రకటనవైపూ, రసప్రసరణవైపూ తీసుకువెళ్తున్న ధోరణీ వుండనే వుంది. ఈ కారణాలవలన, వచన కవితల్లోని వస్తువులో వైవిధ్యం వేయిపడగలుగా విస్తరించుకు పోయింది.

ఈ పరిస్థితి ప్రభావం ప్రత్యక్షంగా మినీకవితల మీద పడుతోంది. వచన కవితలో వస్తూవున్న వివిధ ధోరణులు – వస్తుతత్వానికి సంబంధించినవి – మినీ కవితల్లోనూ చోటు చేసుకుంటున్నాయి. ఇందువలన–వచన కవితా ఖండికల్లాగానే మినీ కవితకూడా – కేవలం ప్రక్రియాపరమైన ప్రాచుర్యాన్ని మాత్రమే పొందగలుగుతోంది. బహుశ, ఈ కారణం వల్లనేమో – కొందరు– అసలు మినీకవిత సాధించేది ఏమీలేదుఅని నిర్ణయాలు చేసేస్తున్నారు

అయితే, మినీకవిత మినీభావ ప్రకాశంతో పఠితమనస్సులో వెలిగి, చమత్కృతితో 'ఓహో' అనిపించి, ఆరిపోవడం కాకుండా భావానికి దృశ్య చిత్రణని కూర్చుకుని పఠిత హృదయ ఫలకం మీద దాన్ని ముద్రించగలిగితే–అది పైనచెప్పినట్లు సామాన్యులలో తెలివిని పుట్టించ గలుగుతుంది. వారిని మంచికోవకు త్రిప్పకలుగు తుంది. మినీ కవిత పట్ల నాదృక్పథం యిది.

ఒక్క ఉదాహరణ చూడండి.

ఆదాయ వర్గాల సర్వే చేస్తున్నాను,
కుక్కిమంచంలో రెండు గాజుకళ్ళు
ఏడేళ్ళక్రితం – ఎమ్మే సోషియాలజీ అయింది
క్లాస్ వచ్చింది – ఉద్యోగం రాలేదు
వాళ్ళమ్మ అల్లమ్మతుంది, అతను
కలలు కొనుక్కుంటూ వుంటాడు
పేరడగలేదు. నాకు తెలుసు–
"హిడెన్ డైనమైట్"!

ఇక్కడ మినీకవితా లక్షణాలుగా మనం చెప్పుతున్న వన్నీ వుండి, దృశ్య చిత్రణవుంది. భావం పఠితచేత కేవలం ఆ క్షణాన్న "సెహబాష్" అనుపించుకుని "సిల్హౌటీ" లోకి వెళ్ళిపోదు, తాను సంతరించుకున్న దృశ్య చిత్రణని మనోయవనిక మీద "ప్రొజెక్ట్" చేసి ఆ 'సీన్' తో అతన్ని 'ఫేజ్' చేయకలుగుతుంది.

ఇలాంటి మినీకవితలు ఇప్పటికే–వచనకవితా సంపుటాల్లో చాలావచ్చేయి. ఇందుకు మంచిఉదాహరణలు–శ్రీశ్రీ 'భిక్షువర్షీయసి' 'బాటసారి'. అలాగే బెల్లంకొండ రామదాసు –

బ్రతుకే ఒక క్రాస్
మనిషే ఒక క్రైస్ట్ – అన్నది

ఈ కోవకు చెందిన ఎంతో శక్తివంతమైన మినీ కవిత.

హోటల్ గేటు ముందు
చిల్లరను మోస్తున్న
చినిగిన గుడ్డ –
చెమట చారలు గీచిన
పాలిపోయిన ముఖం
దానికి కాపలా!

బోయ జంగయ్యగారి ఈ కవితలోని దృశ్యం అందించే అర్థస్ఫూర్తికి వివరణ అవసరం లేదు.

వీటిని చదువుతున్నప్పుడు – వీటి వెనుక ఒక సమాజము, ఆ సమాజపుహోరు, సమాజంలోని వ్యక్తి, అవ్యక్తి వేదన, రొద, జీవన సంగీతం – పఠిత మేధస్సుని తొలుస్తాయి. అందువలన అవి 'కదిలేవి, కదిలించేవి' అవుతాయి.

ఇలా దృశ్య చిత్రణని మిళితం చేసుకున్న మినీ కవితలు సంఖ్యలో ఎక్కువగా వెలువడినప్పుడు – ఒక ప్రక్రియా విశేషంగా మాత్రమే కాక, ఉత్తమ కవితాతత్త్వ నిరూపకంగా కూడా – మినీ కవిత ఉద్యమ రూపం ధరిస్తుంది, పాఠకుల మీద బలంగా తన ప్రభావాన్ని చూపుతుంది.

ఏది ఏమైనా, ఈనాడు మినీకవితలో మినీకవితలు రావాలి. వాసి గురించినచర్చ ఆ తర్వాత చేయవచ్చు. ఈలోగా మినీకవితలు సాధించేది ఏమీ లేదు అనే నిర్ణయం చేయవలసిన అవసరం లేదు. ఇలా నిర్ణయించ దలచుకుంటే – వాఙ్మయమంతా 'ఓం' తో ఆగిపోయి వుండాల్సింది. ఏ రంగంలోనైనా మార్పుని కాలం తెస్తుంది. ఈ మార్పుని సహృదయతతో ఆహ్వానించవలసిన బాధ్యత సాహితీ రంగానికి మరింత ఎక్కువగావుంది!



# లేత లేత నీరెండ

శ్రీ పి. గణపతిశాస్త్రి

అప్పుడే మేలుకున్న ఆకాశం పసిపాప
అమాయికంగా చిందించిన బోసినవ్వులాగ,
ప్రతి ప్రాణిని అప్యాయంగా పలకరించి,
ప్రతి అణువుతోను ఆత్మీయంగా మేళవించి,
ఆదరానురాగాలతో అల్లనల్లన
కలకల నవ్వింది వేళ
చలికాలం తొలిసంజ లేత లేత నీరెండ!

బాటలపై చెట్టుచేమల కొమ్మలమీద, రెమ్మలమీద,
ప్రతి చిన్నారి చిగురాకుమీద
ప్రతి మొగ్గమీద, పువ్వుమీద
తోటలలో పసిరిపచ్చని పచ్చికలమీద -
బంతులమీద, చేమంతులమీద,
మహోల్లాసంతో మైమరిచి,
పరుగులు పెట్టింది నీరెండ!
ప్రశాంతంగా నలువైపుల విస్తరించిందివేళ
కరిగిన పైడి నీరెండ!

చుట్టుగుడిసెలమీద పెద్ద పెద్ద
కట్టడాల కిటికీలమీద,
అట్టడుగు మాలిన్యంమీద
మహనీయ నగరంలో అంతట
పసిమితో, మిసిమితో పరవళ్లు తొక్కి,
ఆనంద లాస్యాలతో, నేల నాలుగు చెరగుల
అపూర్వ మహేంద్రజాలమై,
అందాలు చిందించింది నీరెండ!

అప్పుడే ఉదయించిన వేవెలుగులసామి
అంతులేని జాలి వానజల్లులాగ
అవనీమాత శీర్షంమీద
నిరంతర మంగళాక్షతలే
అభివర్షించిం దీనాడు,
బంగారు జలతారు తళతళలతో
మహానగరంలో లేత లేత నీరెండ!

○V○

# కళ్ళు ఆయుధాలై

శ్రీ కె. అంజయ్య

కళ్ళు వత్తుకోవడం సహజమే
జాతి జాతంతా
నున్నగా కొరగబడుతున్నపుడు-
కళ్ళు ఎరుపెక్కినమాట నిజమే
నున్నగా కొరగబడ్డ రోడ్లపై
బరువైన వాహనాలు బలంగా కదుల్తున్నప్పుడు-
కళ్ళు నిప్పులు కురుస్తున్నాయనడం వాస్తవమే
బొడిపెలు కట్టిన జీవితంతో
జాతి ఇంకా రాజీలే పడుతుంటే.
అణకువమరచి

ఇంకా అణచాలనుకునే వాళ్ళను చూస్తుంటే -
కళ్ళేకాక శరీరాలన్నీ కత్తులవడం
రోడ్లు తారును పారబోసుకుని మొనలు తేలడం
చెట్లు చచ్చుచేతల కొమ్మలన్నీ నరుక్కొని
ముల్కుల్ని తయారు చేసుకోవడం
తొక్కుడు రాళ్ళన్నీ ముక్కలయి
ఒడిసెల రాళ్ళుగా మారడం
వాళ్ళ జాతినంతా పాడెక్కించడం కోసమే
వాళ్ళ జాతికంతా నిప్పెట్టడము కోసమే!

◆◆◆◆◆◆◆◆

# కాపలా

## శ్రీ వి. మోహన ప్రసాద్

కాస్తున్నాం మాకాలనీలో
ధనభంగం జరిగిన
వస్తువాహన కనక అహంకార భంగం
జరిగిన మూడు రాత్రుల ఉల్లి పొరల్నించీ
చిన్నప్పుడు పుల్లాట ఆడినప్పట్లా
కర్రలుచ్చుకొని సైకిల్ గొలుసులుచ్చుకొని
నేపాల్నించొచ్చిన బలహీన పొట్టకక్కుర్తి ఖుక్రి
పెళ్లి చేసుకోటానికనెళ్లి తిరిగి రాని నెలనించీ
దిక్కుతోచక మావీధి కుక్కలకి పిచ్చెక్కిన
మూడు వారాల పథ్నాలు గింజెక్షన్ల
పదహారు సంవత్సరాల బొడ్డుల్నించికారిన రక్కసిరసినించీ
కాస్తూనే ఉన్నాం కాపలా అందరం పోగయి
బొడ్డు జారిన ముసలమ్మ వడ్డాణాన్నుంచీ
లంచాలు మురిగిన మాలాంటి అందరు ఉద్యోగుల్నించీ
పతంజలి ఖాకీవనంలోని సర్వఖాకీ జవాన్లనుంచీ
చెరబండరాజు మాపల్లెలోని కాన్షిఫ్ట్ కాన్సైబిల్‌నాన్నునుంచీ
పిల్లా జెల్లా సా అంతా కాపలా కాస్తోనే ఉన్నాం.

కవిమిత్రుల పానీయ పార్టీల్లోంచి సైకిల్ రిమ్ని
వేలితో దొర్లించుకుంటూ వచ్చిన నానించి
దొంగ చాటుగా తలుపులు చీల్చిన నానించి
శర్వికులందరం కాపలా కాస్తోనే ఉన్నాం
మాకంటే మించిన దొంగల కోసం పొంచుంచి
అంతా అయిపోయినాక పోలీసు కుక్కలకోసం
నంబరు తిప్పితే ఎవరూ రారా మునిసిపాలిటీ
వ్యానైనా రాదా అగ్నిమాపక దళం వ్యానయినారాదా
అని తొంగి చూస్తో
కాని మాలోకి మేమ్మాత్రం చూసుకోం ఒక్క రాత్రేనా
ఎంత కక్కుర్తి ఖుక్రీలవో నీచులవో
గడ్డి కరుస్తూ ఒకర్నొకరం ఎలా కరుచుకుంటావో
ఇనప భోషాణాల్లోంచి పేర్చిన ఇటుకల్లో కూర్చిన
దొంగ బంగారాన్ని మెరుగు పెట్టుకొంటూ
మొల్తాళ్లతోనూ జంద్యాలతోనూ కొల్చుకొంటాం కాలాన్ని
చూస్తాం వాళ్లు పగలు రాపోతే రాత్రేనా వొస్తారని
రాత్రెటూ రాలేదని పగలొస్తారని
చోర చిత్తంతో నేర ప్రవృత్తంలో గుండ్రంగా తిరుగుతూ
కాపలా కాస్తూనే ఉన్నాం
మమ్మల్నే కొట్టాల్సిన కర్రలుచ్చుకుని
తడి నెక్ టైలు మామా గొంతులకి చుట్టుకొని
ప్లేగియారిస్ట్ పాయటాస్టర్స్బాస్టర్డ్స్ మందరవూ
ఉలిక్కి పడ్తున్నాం
నిద్రలో లేచి పీడకర్రల పిడికర్రలుచ్చుకొని
ఏ దారి తప్పిన దగా పడిన చెల్లెలేనా రాదా మా
సామూహిక మానభంగ దారిలోకని
దొంగ గాడిద కొడుకులందరం కలిసి
ఒకే కర్ర మీద ఒకే దెబ్బమీద నిల్చొని
మా మర్యాద కుహనా కాలనీ బాల్కనీలపైకి
ప్రాకిన సన్నజాజి టెలిఫోన్ తీగల 100 మీద వాలుతూ
దొంగలు దొంగలు కర్రలు పంచుకొని
ఒకళ్లనొకళ్లం బాదుకున్నాం కర్రసాము చేస్తో
కనక మీరంతా జాగ్‌తే రహో !



శ్రీ కె. వి. రమణారెడ్డి

# మరుగున పడిన మహావ్యక్తి
# పరమహంస జి. యస్. బి. సరస్వతీస్వామి

తెలుగు దేశం నడిబొడ్డున వ్యవసాయ వృత్తి జీవులలో "ఆత్మవిశ్వాస సూర్యోదయం" కలిగించిన వ్యక్తిని సంస్కర్త అనాలో కర్త అనాలో తెలీదు. ఏ పేరున పిలిచినా ఆ వ్యక్తిత్వం గొప్పది. తమిళనాడులో ఈ. వి. రామస్వామినాయకర్ కంటె ఎంతో ముందుగా బ్రాహ్మణేతరులను కదిపి కుదిపి బ్రాహ్మణ పండితులతో మత చర్చలుచేసి, వాదవివాదాల నుంచి బ్రాహ్మణ విరోధానికంటె ఎక్కువగా బ్రాహ్మణేతర విజయానికి నాంది పలికిన జి. యస్. బి. సరస్వతిని పరిచయం చెయ్యాలి.

పుట్టిందేమో చిత్తూరుజిల్లా చంద్రగిరితాలూకా మల్లవరంలో. జన్మదినం 1878 మే 22. శాఖ పాకనాటి నియోగులు. తల్లిదండ్రులు చదలవాడ శేషయ్య, వరదాంబ. తమది ఎర్రాప్రగడ వంశంలో పదమూడో తరమట! ఒంగోలు తాలూకా చదలవాడ పేరేమో సరిపోతుంది. తరానికి సగటున 30 యేళ్ల అంచనా కడితే దాదాపు 400 సంవత్సరాలు.

తిరుపతిలో మహంతు భగవాన్‌దాసు హైస్కూల్లో చదివి, 1893 తర్వాత కర్నూలులో రామానంద సరస్వతిని, ఆశ్రయించి శుశ్రూషచేస్తూ తర్కాన్నీ, వేదాంతాన్నీ అధ్యయనంచేశాక, కంచికి వెళ్లి 'పరమహంస' సదాశివ బ్రహ్మేంద్ర సరస్వతి సన్నిధిలో తంజావూరు జిల్లా మాయవరంలో చేందగుడి మఠంలో సన్యాసం పుచ్చుకున్నారు. పేరు మారాలిగదా. గోపాల (జి) సచ్చిదానంద (యస్) బ్రహ్మేంద్ర (బి) సరస్వతీస్వామి అయ్యారు, చదలవాడ రామకృష్ణయ్య.

పీఠంతో దేశసంచారం చేస్తూ నెల్లూరువద్ద ఇందుకూరిపేటకు వచ్చి, స్థానికుల పట్టుదలమీద అక్కడే పీఠం వేశారు. వేశారన్న మాటేగాని, 'తిరిగే కాలు' గనక తెలుగు, తమిళ, కన్నడ, మహారాష్ట్ర ప్రాంతాలలో సంచరిస్తూ వచ్చేవారు. స్త్రీలకూ, శూద్రులకూ మాత్రమేగాక, మనిషన్న ప్రతి ఒకడికీ వేదాధికారం వుందనేది తన మతం, లేదంటారు, అన్నారు, పండితులూ, అగ్రహారికులూ, ఆస్థాన విద్వాంసులూ అనేకులు. వీరంతా బ్రాహ్మణులే. వీరి వాదాలను ఖండించేందుకే 'జయార్థప్రకాశిక' లో 'అజ్ఞాన తిమిర భాస్కరము' మొదటి భాగంగా రాశారు (1917). రెండోది 'ప్రశ్నార్ణవాపోశనవాంతమాల'. విరాట్పురుషుడి ముఖం నుంచి బాహువుల నుంచి వూరువుల నుంచీ పాదాల నుంచీ చాతుర్వర్ణ్యం ఏర్పడిందని సాంప్రదాయికంగాఉన్న అభిప్రాయాన్ని సికింద్రాబాదులోని యిద్దరు పండితులు చిలకపలుకుల్లా వల్లించారు. వారిపుస్తకం 'ప్రశ్నార్ణవాపోశనము'. గుణ, కర్మ విభాగం వల్లనే వర్ణాలు యేర్పడినాయని సరస్వతీస్వామి వాదం. ఇక, మూడో భాగం 'ప్రచ్ఛన్న రాజకుల నిర్ణయము' (1928). కమ్మ, కాపు, వెలమ, రెడ్డి వగైరాలు 'సచ్ఛూద్రులు' మాత్రమేనని కాశీ కృష్ణాచార్యులు, దెందుకూరి నృసింహశాస్త్రులు, శిష్టా నృసింహ శాస్త్రులు వాదం చేస్తూపోతే, ఈ కులాలు సూర్యవంశ క్షత్రియులని ఈ పుస్తకంలో ప్రతివాదం చేశారు సరస్వతీస్వామి. నాలుగో భాగం, 'ప్రణవార్థ విచారము'. గుంటూరు జిల్లాలోని పండితులతో చేసిన బహిరంగ వాద ప్రతివాదాల సారాంశం. ఐదోది 'రజస్వలా వివాహఖండన మండనము'. స్త్రీలకు రజస్వలానంతర వివాహములు చేయవచ్చునని చెప్పింది. ఆరోది 'పర్యటన మీమాంస'. 'ద్విజులు' సముద్రయానం చేసి దేశాంతరాలకు వెళ్ళి వచ్చి తప్పు లేదని చెప్పింది. 'వేద సంగ్రహము' ఏడోది. వేదాల సారాంశాన్నితీసింది. 'తప్త చక్రాంకన ఖండన మండన ముండనం' ఎనిమిదోది. శ్రీమాన్ చక్రవర్తి శ్రీనివాస రంగాచార్యులవారు తప్తచక్రాంకిత విషయం గురించి రాసిన దానిని వేద ప్రామాణ్యం లే దన్నది. 'దాసశబ్దార్థ చంద్రికా విమర్శనము' కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రుల 'దాసశబ్దార్థ చంద్రిక' ను విమర్శించింది.

స్వాములవారేమిటీ, పండిత స్వాముల నెదిరించడమేమిటీ? ఇది సత్ సంప్రదాయాలకు అపచారం కాదా? మతవిద్రోహం కాదా? సంఘ ప్రళయంరాదా? రానీ! సత్యం చెప్పాలనేదే ఈ స్వాముల నియమం. ఇలా పరోక్షంగా సంఘ సంస్కరణకు దారి తీసింది. ముఖ్యంగా గుంటూరు కంటె కూడా కృష్ణాజిల్లాలో బ్రాహ్మణుల సంఖ్య హెచ్చు. కాటన్ దొర పుణ్యమా అని ఆనకట్ట వచ్చాక, నడిమి కులాలకు చెందిన రైతాంగం మెట్టసాగుబడి వదిలి మాగాణీ సాగుబడికి దిగి ఆదాపెరిగి హోదా పెంచుకున్నారు. తెనాలి తాలూకా కొల్లూరులో వేదపాఠశాల పెట్టింది బ్రాహ్మణేతరులైన సూర్యదేవర రాఘవయ్య, తలపనేని కోటయ్య వగైరాల ప్రోత్సాహ ప్రోద్బలాలతోనే. యర్రంశెట్టి వీరయ్య నాయుడైతే జందెమే వేసుకున్నాడు. తెనాలి తాలూకాలోని వేద పాఠశాలకు

రేపల్లె తాలూకాలో, బెజవాడ తాలూకాలో, తూర్పు గోదావరి జిల్లా రామచంద్రపురం తాలూకాలో ఎన్నో గ్రామాలు నమూనాలు తీశాయి. కృష్ణాజిల్లా ఈడుపుగల్లులో దాని పరిసరాలలో కమ్మ వారొక రెండువందల మంది దాకా యజ్ఞోపవీతాలు ధరించారు. వేదపాఠశాలల్లో చదువుకుని తిరిగి వచ్చిన బ్రాహ్మణేతర విద్యార్థుల సాయంలో 'స్వసంఘ పౌరోహిత్యం' కూడా చేయసాగారు. కోవెలమూడి గోపాలకృష్ణయ్య, కె. వి. రెడ్డినాయుడు, త్రిపురనేని రామస్వామి చౌదరి వంటి వారి యిళ్లలో వేదోక్తవిధిగానే శుభాశుభకార్యాలు జరుగుతూ వచ్చాయి.

1919 లో కాబోలు తెనాలితాలూకా సంగం జాగర్లమూడిలో టి. రామస్వామివర్మ (త్రిపురనేని వారే) అధ్యక్షతన జరిగిన బ్రాహణేతర మహాసభలో జి. యస్. బి. సరస్వతి ఉపన్యాసానికి హాజరైన కాశీ కృష్ణాచార్యులు, దెందులూరి నృసింహ శాస్త్రులు, పానకాల శాస్త్రిలువచ్చి. ఉపన్యాసం పూర్తయ్యాకగూడా మనస్సు మార్చుకోక వాదం మానక కమ్మవారు వగైరా సచ్ఛూద్రులు మాత్రమేనని చెప్పి వెళ్లారు. రేపల్లె తాలూకా నల్లూరువద్ద మైనేని వారిపాలెంలో, బందరు నోబుల్ కాలేజి సంస్కృత పండితులైన శిష్ట్లా నృసింహ శాస్త్రిలుతో సరస్వతీస్వామి వాదం చేశారు.

సమాజశాస్త్రంలో, 'నడిమి కులాల' కదలికముందు మతాచార పరంగా తర్వాత సాంస్కృతికంగా, చివరకు రాజకీయంగా పైపైకి వెళ్లే ధోరణి (అప్‌వర్డ్ మొబిలిటీ) కి దారితీసి, ఆర్థికంగా రాజకీయంగా ఆధిపత్య స్థానానికి వీలు కలిగిస్తుందంటారు. తిష్ట వేసుకొని ఆ స్థానాలలో వున్న కులాన్ని (ఎంట్రెంచ్‌డ్) అంటే దాని ఆధిపత్యాన్ని కాదనే కులాన్ని (డామినెంట్) అంటారు. సామాజికంగా ఇది మంచిదే కావచ్చుగాని, ఏ కులాధిపత్యాన్ని దెబ్బతీసేందుకని దాని సంస్కృతినీ సంప్రదాయాన్నీ సవాలు చేస్తారో వాటి విషయంలో ఆ కులంకంటె తమది తీసిపోలేదనే భ్రమను కలిగించి, వెనకటి సంస్కృతినీ సంప్రదాయాన్నీ కొనసాగించే పద్ధతి మాత్రం మంచిది కాదు. దీన్ని 'సాంస్కృతికీకరణం' (సాంస్క్రిటైజేషన్) అని కొందరు, 'బ్రాహ్మణీకరణము' (బ్రాహ్మినైజేషన్) అని మరి కొందరూ అన్నారు. దీని సరసనే పాశ్చాత్య విద్యా వ్యామోహం, సీమ చదువులు, బారిస్టరీ గిరీలు జరుగుతూ వచ్చాయి. మరి దీన్ని 'పాశ్చాత్యీకరణం' అన్నారు (వెస్టర్నైజేషన్). సరస్వతీ స్వాములు చూపిన త్రోవ మొదటి పరిణామానికే దారితీసింది. కులసంఘాల యేర్పాటు అప్పటికే మొదలై 1917 నాటికే మదరాసులో దక్షిణ భారత లిబరల్ ఫెడరేషను ఏర్పడింది. దాని పత్రిక పేరు 'జస్టిస్'. చివరికి ఆ సంస్థకు యీ పేరే నిలిచింది. సాంఘిక 'న్యాయాని'కి కంకణం కట్టుకున్న యీ సంస్థ క్రమంగా అధికార రాజకీయం వైపు తిరిగింది. గాంధీ మొదలెట్టిన సహాయ నిరాకరణ ఉద్యమంలో కాంగ్రెసువారు ఎన్నికలను బాయ్‌కాట్ చేశారు. అదే సందని జస్టిస్ పార్టీ అధికారానికి వచ్చింది.

ఈ పరిణామాలను జి. యస్. బి. సరస్వతి వూహించి వుండరు, ఆమోదించి వుండరు. అయినా వాటికి బీజం వేసిన వారిలో తాము ముఖ్యులు. అనుకొన్నది జరిగింది- అతిగా జరిగి వికటంగా పరిణమించింది. అయినా ఆరంభంలో, వుద్దేశంలో, అది కళంకరహితమే. గోపాల సచ్చిదానంద బ్రహ్మేంద్ర సరస్వతీస్వాముల వారిని గుర్తు చెయ్యడం ఇందుకే.

◆◆卐◆◆

# త ప స్వి ని

## శ్రీమతి కోడూరి లీలావతీదేవి

గొణుగుల తరగల హోరు
బురదలు పులిమిన మేను
ముందుకు ఉరికిన పరుగులు
కన్నీటి కెరటాల తరంగిణులు
ఈ అలజడుల జడులు
ఏ గడచిన స్మృతిలో గతులో
ఈ ఆరాటాల వడులు
ఏ హృదయ సంద్రాన చేరి కరగుట కొరకో

విరబోసిన అలల అలివేణులు
ఏ దుశ్శాసను దురాగతాలకు
విడి వడిన
విగత బంధాలో
మమతలు ఎండిన సైకతాల
గట్టు లొరసిన నవ్వుల వెల్లువల
కర్మ సిద్ధాంతాలు విప్పి చెప్పిన
జడ తపస్విని - ఆమె ఉన్మాదిని !

# రాత్రి కొమ్మల్లో ఒదిగి

## జింబో

రాత్రి కొమ్మల్లో ఒదిగి
నిన్ను నేను పిలుస్తున్నానో
లేక
నువ్వే రెక్కలు కట్టుకుని నా దగ్గర వాలుతున్నావో
నాకు గుర్తుండటం లేదు ప్రేయసీ-

రోడ్డు నౌక మీద నడుస్తున్నప్పుడు
వల వేసి నీ కోసం నే గాలిస్తున్నానో
లేక
నువ్వే నా మెదడు వృక్షాన్ని
వంద్రంగి పిట్టవై కదిలిస్తున్నావో
నాకు గుర్తుండటం లేదు ప్రేయసీ-

నువ్వు నా మనస్సులో
చోటు చేసుకున్నప్పుడల్లా
నాకళ్లు మూతలు పడిపోతాయి
నా చెవులు మూగవై పోతాయి.
అప్పుడు నన్ను నేనే మర్చిపోతాను
ఏవో నాల్గు గీతలు
నా మెదడు కాగితం మీద ప్రింటైపోతాయి.

నువ్వు రాగానే
ఈ బాధామయ ప్రపంచాన్నీ, ఈ గాలి శోకగీతాల్నీ
నీలో దాచేస్తాను.

నువ్వు రాగానే
నా కంటి మీద జ్వరపు తెర
కరిగి పోతుంది

నువ్వు రాగానే
నా నిరాశమయ ఆలోచనలన్నీ తొలగిపొయ్యి
"రేపనే తేనె" మీద ఆశ పెరిగి పోతుంది

నువ్వు నన్ను చేరింతర్వాత
ఆకాశంలా గొప్పగా ఫీలౌవుతా న్నేను
అప్పుడు
నా మనస్సు ఆనంద సరస్సులో
తేలియాడే తామర పువ్వవుతుంది

నన్నింత ఉత్సాహపరిచే
నన్నింత ఉద్వేగ పరిచే
నన్నింత ఆశామయిని చేసే
ఓ కవితా-
నువ్వెంత గొప్పదానివి.



# ఉండమ్మా బొట్టు పెడతా....

## దిలావర్

ఎవరమ్మా నువ్వు ?
ఏకాకిగా ఏం చేస్తున్నావు ?
ఒళ్ళంతా చీకటి కప్పుకొని
కళ్ళలో విషాదం నింపుకొని
దిగులుగా కనిపిస్తున్నావు
దిక్కులు చూస్తున్నావు..........?
అయ్యో ! నువ్వా కవితమ్మా !
నేను గుర్తు పట్టనే లేదు సుమా !
సూర్యుడిలా నీ నుదుట సిందూరం మెరిసేది !
అధరాలపై ఎర్రగా మందారం విరిసేది !
నీ పలుకుల్లో యీటెలు పదును పెట్టుకునేవి !
నీ పాటల్లో ఆర్తుల గుండెల మంటలు రగిలేవి !
అవినీతికి నిన్ను చూస్తె గుండె లవిసి పోయేవి !
అంతస్తులు నిన్నుచూసి హడలి వొణికి పోయేవి !
పగిలిన గుడిసెల గుండెల్లో ఆశలు మొసులెత్తేవి !
గనుల్లో కార్ఖానాల్లో సుత్తెలు గళమెత్తేవి !
ఆదిశక్తిలాంటి నిన్ను అనాథను చేశారా ?
కాంతి లేని క్రాంతి లేని విధవని చేశారా ?
ఇంత జరిగినా పిచ్చి కవితమ్మా !
యింకా యీ మీసంలేని కవుల్నెందుకు నమ్ముకుంటావు?
చప్పిడి కవితల మెతుకులు తప్ప
నీకు సరసాన్నం పెట్టలేని వీళ్ళు
సందు దొరికితే మాత్రం
నీతో సరసాలాడేందుకు వెనకాడరు !
నీకంటే - వీళ్ళకు సన్మానాలంటేనే మోజు
పబ్లిగ్గా నెత్తినకొంగేసుకొని మగవిధవలై కులకడం రివాజు!
వీళ్ళ నరనరాల్లో రక్తం లేని కవిత్వం !
వీళ్ళ గుండెల్లో రస స్పందన లేని నీరసం !
నిర్వీర్యమైన తమ "ముసలిపదాలతనం" కనిపించకుండా
అంత్యప్రాసల రంగేసుకున్న యీ ముసలి పెళ్ళికొడుకులు
నిన్ను తార్చడానికి తప్ప-
ఏలుకోడానికి పనికిరారు.
ఇదిగో ఇటు చూడు-!
నీ నుదుట సిందూరమై మెరిసే అరుణ తారలు
నీ పెదాలపై చిరునవ్వులై విరిసే మందారాలు
పలుకు పలుకులో శతకోటి శతఘ్నులు పేల్చేవాళ్ళు
పాటపాటలో విప్లవ జ్వాలలు రగిలించే వాళ్ళు
నీ రక్తంలో రక్తంగా మారి
అరుణోదయానికి తమరక్తం ధారపోసే వాళ్ళు
నీ వూపిరిలోవూపిరిగా నిలిచి
నవయుగానికి ప్రాణం పోసే వాళ్ళు
నవకవులు ! యువకవులు ! నీకు తగిన వరులు !
నీ కృత్రిమ వైధవ్యానికి భయపడి వెళ్ళిపోకు కవితా !
ఉండమ్మా బొట్టు పెడతా !

## శ్రీ మాదిరాజు రంగారావు

# కవిత్వం - అనుభవం

కవిత్వం చదివేప్పుడు లేదా వినేప్పుడు పరిచయానికి వచ్చేది ద్దం. శబ్దాల క్రమ విన్యాసంలో అర్థ భాగాలతో, వాక్యం ఆపై విభాగాలతో భావం అవగతికి వస్తుంది. సామాన్యార్థాని కతీతమైన ఆలోచన మన సంస్కారాన్నిబట్టీ, భావనా స్థాయిని బట్టీ విశిష్టమైన సౌందర్యం స్ఫూర్తికి వస్తుంది. ఈ స్ఫూర్తి విశేషం మనస్సుకు తాదాత్మ్యాన్నీ లేదా విలీనత్వాన్నీ కలిగింప జేస్తుంది. ఇది తరంగ సదృశంగానూ ప్రవాహ సదృశంగానూ మనస్సును స్పృశిస్తుంది, ముంచెత్తుతుంది. ఈ స్థితిలో మనస్సు పరివర్తనకు లోనవుతుంది. ఆనందానికి దారి తీస్తుంది. ఆపైన అనుభవముద్ర బలమైన ఆకర్షణ కేంద్రంగా మనస్సులో నిలుస్తుంది. ఒక దాని తరువాత మరొకటి కలిగే అనుభవ ముద్రలన్నీ ఆ తరువాత కలిగే అనుభవానికి దోహదం చేసేవిగా ఉంటాయి. ఇవి విస్తృతిని కలిగించేవీ, కవిత్వ ప్రవేశ సౌలభ్యానికి దారితీసేవీ, వైవిధ్యాన్ని సంతరింపజేసేవీ, వివేచన పెంపొందింప జేసేవీ, సాక్ష్యాన్ని దర్శింపజేసేవీ.

పాఠకుల లేదా శ్రోతల సంస్కారాన్ని బట్టీ భావనాశక్తిని బట్టీ ఆర్ద్రమైన మనోలక్షణాన్ని బట్టీ, ఉత్తమ కవిత్వంలోని విలువలు ప్రకాశమాన మౌతాయి. ఇక్కడ కొన్ని దశలు ఒక దానితో మరొకటి అనుబంధంతో క్రమించడం గమనించ వచ్చు.

(1) శబ్దాల అర్థం గ్రహించడం (2) అవయవార్థం అవగతికి రావడం (3) భావన ప్రసరించడం (4) పరివర్తనకు లోనవడం (5) తాదాత్మ్యం లేదా విలీనత్వం పొందడం (6) అనుభవముద్ర నిలవడం (7) విమర్శనాత్మకత కలగడం (8) ప్రభావ కేంద్ర మవడం (9) మరో అనుభవానికి ఉపకరించడం (10) సమాహారంగా విశిష్ట వ్యక్తిత్వం నిర్మితం కావడం. ఇవి గ్రహణం, పరిశీలనం, వివేచనం, పరివర్తనం, తాదాత్మ్యం లేదా విలీనత్వం, అనుభవం, విమర్శనం, ప్రభావశీలం, సహాయరూపం, విశిష్ట వ్యక్తిత్వం అన్న అంశాలు క్రమంగా దశలు దశలుగా స్పష్టంగా పేర్కొవచ్చు. ఈ పరిణామంలోని కొన్ని దశలు స్థూలంగా, కొన్ని దశలు సూక్ష్మంగా ప్రతిరచనపట్ల మనలో ఉంటాయి. అయితే ఉత్తమ రచనవల్ల కలిగేది గాఢమైంది, సూక్ష్మమైందీ, నిశితమైందీ, ఈ దృష్టితో ఒక రచన చదవక ముందూ చదివాకా, ఆ తరువాత తరువాత ఉండే తారతమ్యం విస్పష్టంగా అనుభవానికి వస్తాయి. ఒక కొత్త వెలుగులో ఒక కొత్త ప్రపంచంలోకి చేరి, కొత్తకొత్త లక్ష్యాలను అందుకుంటున్నట్లుంటుందీ అనుభవం.

ఆధునిక కవిత్వంలో ఆలోచన, అనుభవం రెండూ సంయోజితమై కన్పించే భావ రూపాలు, సాధారణంగా ఏదో ఒక భావ కేంద్రాన్ని లేదా కొన్ని భావస్థానాలను ఆశ్రయించి ఉంటాయి. ఇక్కడ కథ ఉండదు. కాని స్థితి ఉంటుంది. అది వస్తుగతం కావచ్చు, మనస్తత్వపరం కావచ్చు. దీని ఆధారంగా, కవిత్వం సృజింపబడుతుంది. ఈ సృష్టిలో కొన్నిస్థితుల యోజనం, మనః ప్రపంచం, అందులో దాగిన రహస్యాలు, కదలే స్మృతులు - వీటిని పైకి చిత్రించే, వెలికి తీసే ప్రయత్నమూ కన్పిస్తుంది. ఈ ప్రపంచంలోని వాస్తవం, మన జీవితంలోని అనుభవం రెండూ దీన్ని ప్రభావితం చేస్తాయి. వాస్తవికత జీవితానికి సంబంధించింది. అనుభవం మనో వ్యాపారానికి సంబంధించింది. కవిత్వంలో రెండిటినీ వేరుచేసి చూపలేం. వీటి సహభావం ఒక స్థాయికి చేరినపుడు ఉదాత్తతను సంతరించు కుంటుంది. అసాధారణమైన తత్త్వాన్ని పొందడానికి దర్శనశక్తి అవసరం. ప్రతివ్యక్తిలో అహంకారం ఉంటుంది. ఇది ఒక్కొక్కపుడు క్రియా శీలాన్ని వేగవంతం చేస్తుంది. ఇది అవసరంకూడా. సాధారణంగా క్రియా రూపానికి గాఢత్వాన్నీ, నైశిత్యాన్ని కలిగింప జేస్తుంది. అయితే ఇది ఉత్తమ కార్యాల్లో స్వార్థాన్ని వీడి నిర్మలిసత్వాన్ని పొందాలి. అపుడే ఉజ్వలంగా ప్రకాశిస్తుంధి, ప్రేరకశక్తిగా నిలుస్తుంది. ఇది క్షణాల్లో జరిగేది కాదు. దీనికి కొంత సమయం పడుతుంది. దీని కొక తీరు ఉంది. స్పందనతో వేదనతో భావనతో వర్తనతో ఏర్పడిన తీరులో, మనస్సు క్రమించాలి. ఒక క్రమంలో మనస్సు మలిన రహితం అయ్యేకొద్దీ, తేజోవంతంగా ప్రకాశించేకొద్దీ దార్శనికత సిద్ధిస్తుంది.

కవిత్వంలో కథాప్రణాళిక లేనపుడు ఉద్వేగంపాలు తగ్గినపుడు, ఆలోచనానుభవం ప్రధానంగా వివిధ భావకేంద్రాల సంయోజనంతో ఏర్పడిన కవిత్వాన్ని అర్థం చేసుకోడానికి ఆయత్త మయ్యేసరికె, కొంత సమయం పడుతుంది. దీనితో పరిచయం

అయ్యాక, ఏర్పడిన రూపంలోని తీరుతెలిసాక, శిల్పంలోని ఒడుపు చిక్కాక ఒక తెన్నుతోచి, అర్థం చేసుకోవడం అంత కష్టం కాదు. క్రమక్రమంగా ఇది క్షుణ్ణమై కష్టంగాతోచదు. ఉత్తమ కవిత్వంలో ఆలోచన-ఉద్వేగం, రెండిటిలో ఏదేని ఒకటి ప్రధానంగా తోచవచ్చు. ఈ రెండూ దేనికది విడివిడిగా కాక ఒక్కొక్క రచనలో, ఒక్కొక్క కవి వ్యక్తిత్వంలో ఒక్కొక్క విధమైన హెచ్చు తగ్గుల్లో విచిత్రమైన సమ్మేళనాన్ని పొందుతుంది. ఒకే కవి వివిధ సందర్భాల్లో వెలువరించిన కవితల్లోనూ ఈ లక్షణం వేరువేరుగా చూడవచ్చు. ఆ వేగ స్థాయి అప్పుడు పొందిన అనుభవ రూపాన్ని బట్టి ఉంటుంది. వస్తువూ, భావస్థానాల ఎన్నిక, ఆలోచనాశక్తిని బట్టి ఉంటుంది. అయితే స్థూలంగా ఒక కవి వ్యక్తిత్వం లేదా, రచనా విషయంలో, ఒకమారుచదివి ఒక నిర్ణయానికిరావచ్చు. దీన్ని వివేచన చేస్తేగాని రచనకు సంబంధించిన అనేక రహస్యాలు వెనుక దాగినవి వెల్లడికావు.

ఆధునిక కవిత్వంలో చాల సందర్భాల్లో ఏర్పడే క్లిష్టత భావరూపాలకూ ప్రతీకలకూ సంబంధించింది. వివిధ భావరూపాలతో ప్రతీకలతో, విశిష్టమైన స్వరూపాన్ని యోజితం చేసేప్పుడు వాని సమీకరణ పద్ధతిలో క్లిష్టత కనబడవచ్చు. భావరూపం ఆలోచనా గతమైంది. అవ్యక్త చేతనయొక్క స్పందన రూపంగానూ, ఆవిష్కృతమౌతుంది. భౌతికాతీతమైన రూపాన్ని అనుభవానికి తెచ్చే శక్తీ ఉంది. ఏ కవీ పాఠకుల్ని లేదా శ్రోతల్ని కష్టపెట్టే ఉద్దేశంతో భావరూపాల్ని నిర్మించడు. అతని ఉద్దేశం గ్రహించి ఆలోచనతో స్పందించి అనుభవించవలసిన అవసరం ఒక్కొక్క మారు కలగవచ్చు. ఇంకా భావంలో గాఢత్వంవల్ల లేదా భావం బాగా కుదింపబడడంవల్ల క్లిష్టత చోటు చేసుకొనే అవకాశం ఉంది. కథా సూత్రం లేకపోవడంవల్ల, భావకేంద్రం చుట్టూ ఆలోచన అల్లడంవల్ల - భావరేఖలు పరివర్తితం కావడం వల్లనూ కావచ్చు. దీనికి ప్రత్యేకంగా అనుభవదృష్టి, వ్యాఖ్యాత్మకమైన ఆలోచనాపై ఖరికీ అవసరం. ఇది ఒక్కమారు పరిచయమైతే క్రమంగా ఒక పద్ధతికి అలవాటుపడి, ఆ తరువాత సులభంగా అవగాహనకు మనస్సు సిద్ధమౌతుంది. కవిత్వంలో భావరూపం ప్రాముఖ్యం అనితరమైందన్న విషయం వేరే చెప్పనక్కరలేదు. కవిత్వం విషయంలో ఏది ఔనో చెప్పడం కంటే, ఏది కాదో చెప్పడం సులభం. అందునా వ్యక్తీ సమాజం ఎన్నో ప్రభావాలకు గురి ఔతున్న తరుణంలో, దీని నిర్ణయం మరీ క్లిష్టతరమైంది. చిత్రమేమంటే ఈనాడు ఒక్కరూపంలోనే ఎన్నో అభిప్రాయ భేదాలున్నాయి. ఛందస్సులో అందునా అక్షర ఛందస్సు మాత్రా ఛందస్సులోనూ, ఛందస్సు వదిలేసి వ్రాసే వాళ్ళూ ఉన్నారు. ఇదే కాకుండా, ఇంకా అనేక విధాలుగా సమాజంలో స్వేచ్ఛ, భిన్నాభిప్రాయాలు కలిగి ఉండడానికవకాశం ఉన్నపుడు, భిన్నమార్గాలు అవలంబించడం భిన్నపద్ధతులు రావడం అన్నిరంగాల్లో జరుగుతూన్నదే. ప్రజాస్వామ్యం యొక్క గొప్ప ప్రయోజనాల్లో ఇదొకటి. అలాగే ప్రయోజనం విషయంలోనూ వివిధదర్శనాలు చూడవచ్చు. ఇవన్నీ సాహిత్యాన్ని సుసంపన్నం చేస్తాయి. సంస్కృతీరూపాన్ని విస్తృతపరుస్తాయి. అయితే ఏది స్వీకార్యం? ఏది అవసరం? మొదలైన ప్రశ్నలకు సమాధానం ముఖ్యంగా ఎవరికి వారు నిర్ణయించుకోవలసిందే. స్వయం నిర్ణయం, వ్యక్తిత్వానికి నిదర్శనం. వ్యక్తిలోని ఆలోచనకూ, అనుభవానికీ, కృషికీ, ప్రమాణరూపం గానూ నిలచేది.

జీవితంలోవలెనే రచనలోనూకొత్తను అన్వేషించే లక్షణం, మార్పునుకోరే తత్త్వం, పాతపై ఒక విధమైన ఏవగింపు, కొత్త ప్రయోగాలకు దారి తీస్తుంది. సమాజంలోని స్వేచ్ఛా వాతావరణం, రచనలోనూ స్వేచ్ఛను అవలంబించే ధోరణికి దారి తీస్తుంది. ఒక్కొక్కపుడు సమాజంలోని కఠినమైన నిబంధనలూ పనికిమాలిన విలువలూ సంకుచితమైన ఆలోచన నుండి విముక్తంకోరే మనస్సు, స్వేచ్ఛవైపు ఉత్క్రమించే ప్రయత్నం చేస్తుంది. ఈనాడు ఛందస్సు విషయంలో ముక్తచ్ఛందస్సు ధోరణి ఒకమలుపు తిరిగిన దారిలో నిల్చే చోటులాంటిది. ఇదే చరమావధి కాదు. కఠినమైన పాతనియమాలనుంచి విముక్తికోరే స్వేచ్ఛాతత్త్వం యొక్క తీవ్రత, ఈ పద్ధతినవలంబింప జేసింది. కొంత కాలానికి మరో విధమైన కొత్త ఛందస్సు అవతరించవచ్చు. పరిమిత నియమాలతో ఎక్కువ స్వేచ్ఛతో కూడిన పద్ధతివైపు క్రమంగా మనం ప్రయాణించవచ్చు. ఛందస్సువల్ల సంక్షిప్తత చేకూరడం, అస్పష్టత తొలగడం విశిష్టమైన గతిసిద్ధించడం - ఈ గుణాలతో చెప్పరాని ఆకర్షణ ఏదో మనల్ని వశంచేసుకుంటుం దన్నది ఎవరూ కాదన లేరు. పైగా వైవిధ్యాన్ని కోరే తత్త్వమూ, కొత్తను అన్వేషించే స్వభావమూ ప్రయోగాలకు కారణం ఔతాయి. సాధారణ వచనం యథాతథంగా కొన్నిసందర్భాల్లో ప్రభావం కోసం ఉపయుక్తమౌతుంది. కవిత్వంలో ఈనాడు ఎక్కువ భాగం సాధారణ వచనంకన్నా భిన్నమైన పద్ధతిలోనే ఆవిష్కృతమౌతూంది. దీని కనేకమైన ఉదాహరణ లివ్వవచ్చు. మొత్తం మీద ఏదో ఒక విశిష్టతను సంపాదించే ప్రయత్నం ఉంది. మరో విషయం, ఈనాటి వచన కవిత్వంలో అక్కడక్కడా కుదిరే యతులూ, ప్రాసలూ అక్కడక్కడా సాగే క్రమమైన గతీ, చూడవచ్చు. ఇది ఛందో విషయకంగా ఒక సంకీర్ణతను తెలియ జేస్తుంది. ఎక్కడో లయ అందుతూ, ఏవో మాత్రలు సరిపోతూ, అంతలో యతి సరిపోయో,

ప్రాస పదిరో, ఏదో ఛందోరూపానికి దగ్గరగా పాదాలో, పాద ఖండాలో మెదలుతూ ఒక ఊపు, ఒక గతి అంతలో మారుతూ, ప్రత్యేకమైన ఆరోహణం, అవరోహణం కలిగి, మనసులో చిత్రమైన అనుభవానికి దారి తీసే విన్యాసం ఉంటూంది. దీన్ని వివేచిస్తే ఈనాటి వచన కవిత్వంలో సంకీర్ణతతో పాటు సంశ్లిష్టత ఉన్నట్లు గోచరిస్తుంది. ఇది ఛందస్సు ప్రభావం నుండి తప్పించుకోలేని మనస్స్థితిని సూచిస్తుంది. ఛందస్సు అంటే ఏవో ఒక ప్రత్యేకమైన పద్ధతిలో గణాల ఏర్పాటు, మాత్రల పంపకంతోనే ఆగక, ఒక విశిష్టమైన గతివిన్యాసం సాధించే ప్రయత్నంలోనే, దాని శక్తి ఉంది. ఇందుకు భిన్న భాషల్లో వివిధ విధానాలు అవలంబించడం జరిగింది. అన్నిటిలోనూ ఏదో యాంత్రికంగా లాక్కొని పోయే గుణం తప్పనిసరిగా ఉంటుంది. ఇందులోనే కవి తన ప్రతిభచేత గతి విన్యాసంలో, శిల్పవిశిష్టతను ప్రవేశపెడతాడు. ఇది సాధారణ పాఠకులు ఆనందించడానికీ, విశేషంగా భావుకులూ, విమర్శకులూ వ్యాఖ్యానించడానికీ, వివేచించడానికీ అవకాశం కలిగిస్తుంది. కవి ఆలోచనలో స్పష్టతకూ, అభివ్యక్తిలో ప్రస్ఫుటత్వానికీ దోహదం చేస్తూనే, రూపానికొక ఆకర్షణీయమైన గతినీ ఇచ్చేంతవరకు ఛందస్సుకు కవిత్వంలో అనుభవంతో ప్రమేయం ఉంది. అయితే నియమాలు ఎక్కువై ఆలోచనలో స్పష్టతకు బదులు కాఠిన్యం, ప్రస్ఫుటత్వానికి బదులు జటిలత్వం, కేవలం రచన శిల్పమే తాండవిస్తూ, భాషా ప్రాగల్భ్యంతో, స్వచ్ఛమైన కవిత్వం మరుగున పడిపోయే ప్రమాదం లేకపోలేదు. ఛందశ్శిల్పం కవిత్వాన్ని మింగేసి రచన మొత్తం మీద పీట వేసుకోవడం సమంజసంకాదు. ఈ కారణంగానే ఛందోవైముఖ్యం ఏర్పడింది. కాని కవికీ తెలిసీ తెలీకుండా వచన కవిత్వంలో ఛందస్సు నెరపిన అనివార్యమైన ప్రభావ పరంపరను గురించి సామాజిక, సాంప్రదాయ మనస్తత్వ పరమైన అంశాలపై దృష్టిలో పరిశీలనం జరగవలసి ఉంది.

ఈ సందర్భంలో మరో విషయం – కవిత్వం రెండు విధాలు. మొదటిది పైకి చదివేట్టు చేసేది. మొదలు పెట్టగానే వేగం అందుకొని రచనా శిల్పంతో ముందుకు తోసుకొనివచ్చే ఆవేగంతో, గతి విశేషం కలిగింది. ఇక్కడ ఛందశ్శిల్ప ప్రమేయం ఉంది. రెండోది మొదలు పెట్టగానే మనస్సును ఆలోచనామయం చేసేది. గతి విశేషంపైకన్నా దృష్టి, భావంపై ప్రసరిస్తుంది. ఇంతకు ముందు పేర్కొన్న క్లిష్టతకు మొట్టమొదటి దశ ఇది.

జీవితం వ్యక్తికి నుండి వ్యక్తికి భేదించినట్లే, ప్రతీ సృజన రూపం రచయిత నుండి రచయితకు భేదిస్తుంది. జీవితంలో పరిచయాలు, పరిస్థితులు, అభిరుచులు, అనుబంధాలు, ప్రయోజనాలు మాదిరే రచనా విషయంలోను అన్వయించుకోవచ్చు. అందువల్ల అభిప్రాయ భేదాలూ తరచూ ఏర్పడుతూంటాయి. సహజం కూడా. ఒక్కొక్కప్పుడు బాహిరమైన అంతరమైన హేతువులు కారణంగా, సవ్యాజంగానో, నిర్వ్యాజంగానో ఇవి కలుగుతూంటాయి. ఈ సమస్త అభిప్రాయాల ప్రకటనారూపమే విమర్శనా ప్రపంచం. పాఠకుడు ఆగిన చోటునుండి వ్యాఖ్యాత మొదలౌతాడు. వ్యాఖ్యాత నిలచినచోటునుంచి విమర్శకుడు ప్రారంభమౌతాడు. విమర్శకుడు వదలిన చోటునుండి సహృదయుడు లేదా భావుకుడు పయనిస్తాడు. వీరంతా పాఠకులకూ కవిత్వానికీ మధ్య సామాన్యంనుండి విశేషం వరకూ వివిధ రూపాల్లో అనుబంధాన్ని స్థాపించేవారే. వీరునెరపే ప్రభావం చాలవిశిష్టమైంది. ఒక్కొక్కప్పుడు ఆలోచనాగతి మారి పోవచ్చు. ఎంతో కాలంనుండి మరుగునపడి ఉన్న రచన వీరివల్ల వెలుగులోకివచ్చి, ఆలోచనకు నిలయం కావచ్చు, ఎంతో ప్రశస్తి కెక్కిన రచన ఉపసంహృతం కావచ్చు. లేదా క్రొత్త దృక్పథం ఏర్పడవచ్చు. అందువల్ల విమర్శకుని బాధ్యత చాల గొప్పది. గ్రహణశక్తితోపాటు పరిశీలనం, వివేచనం ఉంటే సరిపోదు. స్పందన గుణంతోపాటు ఉదారదృష్టి అవసరం. ఒక్కొక్కప్పుడు ఈ ప్రయత్నంలో దారి తప్పడం జరుగుతుంది. ఆధునిక కవిత్వం విషయంలో ఇంకా క్షుణ్ణమైన పథరూపం ఏర్పడలేదు. కాబట్టి, పై జాగరూకత ముఖ్యం. ఇందులో వివిధ భావస్థానాల సంవిధానం, వివిధ భావరూపాల సహయోగంతో జరిగే నిర్మాణం గురించి పరిచయంతోపాటు, అభిలాష అవసరం. ఈ అనుభవం క్రొత్త ప్రపంచాన్ని దర్శించడంవంటిది. ఇందులో ప్రవేశించిన కొన్నాళ్ళకు గాని తెలిసిరాదు. ఎన్నాళ్ళైనా తెలీకపోవచ్చు. తెలుసుకోడానికేమీ అందులో ఉండకనూపోవచ్చు. కాని అన్నీ తెలుసుకోవాలనే కోరిక, ఓపిక, ఆలోచన ఉండాలి. ఆ వాతావరణంతో సుస్వరతను పొందే స్పందనమూ కలిగి ఉండాలి. ప్రవహించే కాలంలో, కదులుతూన్న వాస్తవాన్ని గుర్తించి, అందులో ప్రయాణం చేయడమూ, ఆ అనుభవాన్ని పొందడమూ ఒక విశేషమే.

శబ్దంనుంచి ప్రతీయమానార్థందాకా విమర్శకుడు ఎప్పుడూ కవికీ పాఠకునికీ మధ్య అనుబంధాన్ని స్థాపించడానికీ, ఇది వర కేర్పడిన దాన్ని దృఢతరం చేయడానికీ ప్రయత్నిస్తాడు. వారిలో అనుభవ సృష్టికీ, వికాసానికీ దోహదం చేస్తాడు. ఒక్కొక్కప్పుడు తనకు నచ్చనివీ తాను విభేదించినవీ తీవ్రంగా విమర్శించవచ్చు. కాని ప్రధానంగా రచన అంతస్తత్వంలో పాఠకుని మనస్సు ప్రతిస్పందితం చేయకల విమర్శ ప్రత్యక్షమైన అనుభవ విస్తృతికి సహాయకారి అవుతుందనడంలో సందేహం లేదు. కవిత్వంలో బాహ్యరూపం అందరికీ అందుబాటులో ఉండేదే. కాకపోతే

కొంచెం సంస్కారంతో వశం చేసుకోవచ్చు. అంతస్స్వరూపం ఉత్తమ సంస్కారాన్ని బట్టి ఆలోచనతో వివేచనతో అనుభవానికి వస్తుంది. మొదటిది సాధారణమైంది. రెండోది విశిష్టమైంది. మొదటిది రెండోదానికి ఆధారం. రెండోది కవిత్వానికి ముఖ్యం. అందువల్ల విమర్శకుడు రెండోదాన్ని గురించి ఎక్కువ శ్రద్ధ వహించ వలసి ఉంటుంది, ఇతడు సాధారణ పాఠక ప్రపంచానికి దర్శకుడౌతాడు కాబట్టి. కవిత్వంలో ఆనందాన్నో, ప్రయోజనాన్నో ఆశించినా ఈ రెండిటికీ అనుభవం ముఖ్యం. దీని ప్రభావం వల్లనే ఏమైనా జరిగేది. కాబట్టి దీన్ని కాపాడే విమర్శకుని మాటకు గల విలువను గురించి వేరే చెప్ప నవసరంలేదు.

కవి ఏదో చెప్పదలచుకున్నాడు. ఎవరికి? అంటే కవిత్వంతో పరిచయం ఉన్నవాళ్ళకూ, పరిచయం కావాలని అభిలషించేవాళ్ళకూ. అయితే కవిత్వం దేనికి? మనోవికాసానికీ, ఇందులో నుండి ఆహ్లాదమూ, పరివర్తనమూ రెండూ ఉద్గమిస్తాయి. ఇలా సమాధానం ఎంతైనా చెబుతూ పోవచ్చు. ఏమైనప్పటికీ కవిత్వం వ్యక్తి, సమాజం పరస్పరమూ అనుబంధంతో, తన సంస్కృతీ తేజంతో, నిఖిలమానవ ప్రస్థానాన్నీ వేగవంతంచేసే భూమికనే నిర్వహించిం దని చెప్పవచ్చు. ఒక్కొక్క కాలంలో, ఒక్కొక్క విధంగా వైవిధ్యం లోనూ, ప్రత్యేకమైన గతితో, అప్పటి చారిత్రకావసరాన్ని బట్టి, అనుభవ స్పందనం కేంద్ర శక్తిగా, అవతరించిన మాట వాస్తవం.

---

# శరన్నిరాజనము

## శ్రీ శనగన నరసింహస్వామి

మానసము నుండి ధాత్రికి మరలి వచ్చు
అంచలో యన రెక్క లల్లార్చుకొనుచు
సాన వట్టిన శస్త్రంబువోని నిగ్గు
టంబరమున దోచె శుభ్రాంబుదములు.

ఖండ ఖండంబులుగ నభోమండలమున
ఏడు రంగుల చాప మదృశ్య మయ్యె -
నీరద స్నిగ్ధ గంభీర నిస్వనముల
తోడ వనకేకి నర్తనక్రీడ లుడిగె.

పాలమున్నీటిపై పాప పాన్పుపైని
మేలుకొనియెనొ లేదొ లక్ష్మీధవుండు
పగలు బిట్టెక్కసాగె భాస్వత్ప్రభాళి -
రేల జైవాతృకాంశు లమృతము గురిసె.

శ్రాంతి యెరుగని శ్రావణా సారవృష్టి
రూపురేకలు సెడిన సరోజ వనము
భాస్కరోదార కర పరిష్వంగ దీప్తి
కోలుకొనసాగె నల్లన కొలను నడుమ.

ఏటి కెరటాల మాటికి నీదులాడి
కేతకీలత వలపులు గిలుబు చేసి -
నీప తరువాటికా వీధి నిర్గమించి -
తరుణ పవమానములు వనాంతముల నొలసె.

తేరె జలములు - పంకంబు లారె - కేరె
జంతు సంతతి - దిక్కు లచ్ఛత వహించె -
మీరె తటినీ తటంబుల సారసాది
బహు విహంగమ కలరవ ప్రతిరవములు.

పూర్వ పాప విపాకము భుక్తమైన
పూరుషుం డాత్మతేజము పొందునట్లు
జలధరా వరణంబులు తొలగినంత
తిగ్మ కిరణుడు సహజ సందీప్తి గాంచె.

కర్మగతి కొంతకాలము క్రౌర్య మెనసి
నరుడు పై సాధు గుణమును బొరయు కరణి
కాలవశమున మలినత గాంచియు జల
ములు క్రమంబుగ స్ఫటిక నిర్మలత నూనె.

శరదుదయలక్ష్మికి న్నిజ
పరిజన మందందు నిగుడబట్టిన వింజా
మరల సిరులనగ కాశ
స్ఫుర దద్భుత కుసుమరాజములు విలసిల్లెన్.

శ్రీ చలపాటి ఆనంద నరశింహులు

# విజయాదిత్యుని నిట్టూరు శిలాశాసనము

అనంతపురం జిల్లా తాడిపత్రి తాలూకా 'యాడికి' దగ్గర నిట్టూరను గ్రామమునందు ప్రస్తుత శిలాశాసనమున్నది. ఈ గ్రామము యాడికి గ్రామమునకు 8 కిలో మీటర్ల దూరమున గలదు. బాదామి చాళుక్యుల వంశమునకు చెందిన శ్రీ విజయాదిత్యునికి సంబంధించిన ఈ శాసనము శ్రీ ఎర్రెడ్డిపల్లి బయన్నగారి పొలము నందున్నది.

పై శాసనము రోడ్డుకు దక్షిణవైపున శ్రీ ఎర్రెడ్డి బయన్న గారి పొలంలో ఒక రాతి పలకపై మూడు వైపుల చెక్కబడి యున్నది. ఈ శాసనము [మూడు - వైపుల కలసి] పదునొకండు పంక్తులలో చెక్కబడియున్నది. ఇందున్న భాషయొక్క స్వభావ సంబంధాలు క్రీ. శ. ఏడవ శతాబ్దపు తెలుగు - కన్నడములకు చెందినది. భాష మాత్రము అనాటి తెలుగే. ఇది ప్రాచీన దశకు చెందిన దగుటచే దీని భావము అంతసులభముగా గ్రాహ్యము కాదు. ఉదాహరణకు "వరిసామువరు వచ్చముళ" (శాసన పంక్తి-9) సరిగా అర్థము గాదు.

దీని యందలి అక్షర గుణింతము కొన్ని విశేషములు తెలియ జేయుటతప్ప, క్రొత్తదేమియు తెలియజేయదు. ప్రస్తుతమున 'కౌండిన్య'కు - 'గమిణ్డిల్లి' (శాసన పం క్తి - 5)గా వ్రాయబడి సందేహము కలుగజేయుచున్నది. అదే నిజమైన 'గ' అను అక్షరమునకు మధ్య అడ్డముగా ఒక గుర్తు పెట్ట వలసి యుండును. అపుడు సండిల్యను సాండిల్యగా తెలుసు కొనుటకు వీలుండెడిది.

బాదామిచాళుక్య వంశమునకు చెందిన వినయాదిత్యచక్రవర్తి యొక్క కుమారుడు-విజయాదిత్యుడు. వినయాదిత్యుడు తన తండ్రి యైన మొదటివిక్రమాదిత్యునితర్వాత సింహాసనమధిష్టించి క్రీ.శ.681 నుంచి 696 1 వరకు పాలించినట్లు చరిత్ర-తెలుపు చున్నది. ఇతనికి శ్రీ పృధ్వివల్లభ, సత్యాశ్రయ, యుద్ధమల్ల అను బిరుదులు గలవు. ఇతని తర్వాత యితని కుమారుడైన విజయాదిత్యుడు క్రీ. శ. 696 నుంచి 732-33 వరకు రాజ్యం చేసినట్లు తెలియు చున్నది. ఇతడు యుద్ధరంగములయందు, పరిపాలన విషయములయందు తన తాత, తండ్రుల వద్ద పూర్తిగా తర్ఫీదు పొందినట్లు చరిత్ర తెల్పుచున్నది. విజయాదిత్యుడు తన తాతయగు మొదటి విక్రమాదిత్యుని కాలము నుంచి జరిగిన యుద్ధములలో - చురుకుగా పాల్గొని జయలక్ష్మిని బడసినట్లు అతని శాసనములు తెల్పుచున్నవి. విజయాదిత్యుడు పరిపాలించిన కాలము చాల శాంతియుతమైనదిగా వర్ణించబడినది. అయినను - యితను గూడా పల్లవులతో యుద్ధంచేసి పల్లవ చక్రవర్తియైన పరమేశ్వర వర్మను ఓడించి, అతని నుంచి కప్పము వసూలు చేసినట్లు తెలియుచున్నది. విజయాదిత్యుడు సర్వ మతములను సమానముగా నాదరించెను. ఇతడు బీజపూరు జిల్లాలో గల పట్టడ్ కల్ యందు శివాలయం కట్టించినట్లు, యితని- సోదరి



లక్షమేశ్వర్ యందు జినదేవాలయం కట్టించినట్లు గూడా చరిత్ర తెలుపుతున్నది. ఇతడు జినమత ప్రచారములకు గ్రామములను గూడా విరాళముగా నొసగినట్లు - గలదు. అటువంటి వీరుని ప్రథమ రాజ్య వర్షంపై చారిత్రికులు నిశ్చలమైన అభిప్రాయం వెల్లడించ లేక పోయిరి. దీనికి విజయాదిత్యుని శాసనాలు సహక రించక పోవటమే ముఖ్యకారణం. విజయాదిత్యుని శాసనాలు సాధారణముగా క్రీ. శ. 696 నుంచి 732-33 మధ్య లభ్యమైనవి.

ప్రస్తుత శాసనము విజయాదిత్య సత్యాశ్రయ భట్టారకుని ప్రథమ రాజ్య వర్ష ద్వితీయ సంవత్సరాభి వృద్ధి యొక్క-

ఉనికిని తెలియజేయుటచే దీనికి యతి - ప్రాముఖ్యం యివ్వబడింది. పైగా బాణరాజు విషయము మరియు అతని 'వంగరు' విడిదిని గురించి తెలుపుచున్నది.

ఈ శాసన ప్రకారము ఆ కాలంలో అనంతపురం మండలానికి చెందిన వంగనూరునాడు అను ప్రాంతమును బాణ రాజగు 'పాళచెక్కి' అను వాడు ఏలుచున్నట్లు, అతని రాజధాని నిట్టూరు అయినట్లు యీ శాసనం మూలంగా మనం గ్రహించ వచ్చును. మరియు విజయాదిత్యుడు నిట్టూరును జయించిన విజయోత్సాహముతో కొందరు బ్రాహ్మణులకు రాచమానంబున ఏబది - మరుతు....ల్లు భూమి దానం చేసినట్లు యీ శాసనం తెలుపు చున్నది. దాన గ్రహీతలగు బ్రాహ్మణులు కౌండిన్య గోత్రానికి చెందిన వెళాల గుణ్ణయ మరియు వెనయ అనువారు. ఈ విషయం శాసనంలో 5, 6 వ పంక్తులలో విశదీకరించబడినది. ఇందుకు సాక్షులుగా దొణయ మొదలగు ఆరుమంది కలరు. అందు యిద్దరు బ్రాహ్మణులు. వారు జన్నయ మరియు అజ్జిప అనువారు. ఈ విషయం శాసనంలో 7, 8 వ పంక్తులలో విశదీకరించ బడినది. ఈ దాన శాసనమును - ఎవరైన అతిక్రమించిన యెడల వారు పంచ మహాపాతక[2]ములు చేసినవా రగుదురు. [పంచ మహాపాతకములు- 1. బ్రహ్మహత్య, 2. సురాపానము, 3. దొంగ తనము, 4. గురుతల్ప గమనము, 5. అట్టి పాతకము లొనర్చు వారితో సంసర్గము].

పైన చెప్పినట్లు తారీఖును గురించిన ప్రసక్తి యుండుటచే యీ శాసన ప్రాముఖ్యత అమితం.

వినయాదిత్యుని పాలన ముగిసిన వెంటనే అతని కుమారు డైన 'విజయాదిత్యుడు' క్రీ. శ. 696 నుండి రాజ్య మేలుట ప్రారంభించినట్లు ప్రముఖ చరిత్రకారులైన - ఆర్.జి. భండార్కర్ మరియు కె. ఎ. నీలకంఠశాస్త్రుల[3] నమ్మిక.

విజయాదిత్యుని అలంపూర్ శాసనం[4] శక సంవత్సరం 626 తెల్పుచూ విజయాదిత్యుని 18 వ రాజ్యవర్షంలో నివ్వబడినట్లు పేర్కొన్నది. కాబట్టి - 608 శక సంవత్సరములు [అనగా క్రీ.శ. 686 సంవత్సరము] నుండియే విజయాదిత్యుడు రాజ్యవర్షం ప్రారంభమైందని మనము గ్రహించ వచ్చును. ఇతని తండ్రి పరిపాలన - ముగిసిన విషయమును, విజయాదిత్యుడు సింహాసనము నకు వచ్చిన విషయమును సరిగా పరిశీలించ నందునే, అతని రాజ్యారంభ కాలం ఇతమిద్ధంగా తెలియ కున్నది. ప్రస్తుత శాసనాధారమునుబట్టి, యీ దానముఅతడు ప్రప్రథమముగా రాజ్యము నకు వచ్చిన [లేక] .... .... .... సింహాసనాసీనుడైన రెండవ సంవత్సరమున యిచ్చినట్లు స్పష్ట మగుచున్నది. అతడు క్రీ. శ. 686 వ సంవత్సరమున యువరాజుగా సింహాసనాధిష్ఠుడైన నాటి నుండి ప్రథమ రాజ్య మారంభ మైనట్లు మనం గ్రహించ వలయును. చరిత్రకారు లూహించినట్లుగా విజయాదిత్యుడు - క్రీ. శ. 696 సంవత్సరము నుండి సకల లాంఛనాలతో - రాజ్య మేలుట ప్రారంభించి యుండ వచ్చును. అయిన ప్రస్తుత శాసనపు తారీఖైన ద్వితీయ వర్షమును క్రీ. శ. 687 నుండి 688 తో తుల్య మైనదిగా నిర్ణయించవచ్చును, అతడు సంపూర్ణమైన 'అధిరాజు' గా రాజ్యమేలుటకు పూర్వం దాదాపు పది, పదునొకండు వర్షములు అతని తండ్రికి యువరాజుగా, తన సహాయ సహకారములు అందించి యుండవచ్చును. లభ్యమైన విజయాదిత్యుని శాసనము లను బట్టి, విజయాదిత్యుడు యువరాజుగా వ్యవహరించిన నాటి నుండి యాతని రాజ్యవర్షం ప్రారంభమైనదిగా గ్రహించ వలయును. అతని అలంపూరు శాసనం ప్రకారం ప్రస్తుత శాసనం లోని 'ప్రథమ రాజ్యం' క్రీ. శ. 687-688 గా పరిగణించవచ్చును.

శాసనము - నాటి భౌగోళిక స్వరూపము -

శాసనమున నుదహరించిన నిటురు - తాడిపత్రి తాలూకా అనంతపురం జిల్లాలో గల వంగనూరికి సుమారు యిరువది కిలో మీటర్ల దూరమునన్న యిప్పటి నిట్టూరుగావచ్చును. అట్లే బాణ రాజు శిబిరము (విడిది)గ చెప్పబడు 'వంగరు' యిప్పటి వంగనూరు గావచ్చును.

సూ చి క లు :-

1. వి. డి. మహాజన్ - ఏన్షియంటు ఇండియా - పేజి - 595-96
2. కుందూరి ఈశ్వరదత్ - ఇన్స్క్రిప్షనల్‌గ్లాసరి - పేజి - 170
3. అర్లి హిస్టరీ అఫ్ దక్కను - పేజి - 43
4. అలంపూరు శాసనం శకసంవత్సరం, 626లో నొసంగబడినది. కార్పస్ అఫ్ తెలంగాణ ఇన్స్క్రిప్షన్సు (పార్టు 4) (ఏ. పి. జి. ఎ. యస్. 32) పేజి 3-4 మరియు స్టోను స్కల్ప్చరు - అలంపూరు మ్యూజియం పేజి - 1

**TEXT :-**

మొదటి ముఖం

1. స్వస్తిశ్రీమత్ విజయాదిత్య సయశ్రీ[1] ప్రిధివిభల్లభ[2] మహా [ప] హ [హా] రా
2. జ అధిరాజ పరమేశ్వర భట [టా] రల విజయ రాజ్య సవరంబు[3]
3. ప్రథమ రాజ్య [౦] బున [రెణ్డగు] నేణ్డువణరాజుల వంగరు
4. విజయంబు ఏళవ [వా] రి ప [పా] శ చెళ్కి- కేణ్డు రాజులు నిటురు పటు
5. గున్న ఏటచు గముణ్డల్లి[4] గోత్రంబున వెళాల గుణ్డయ పాట వెనయ తేగరి

రెండవ ముఖం

6. రాచమానంబున ఏబది మరుతుల్లు[5] ఇచ్చినట్టిదెని
7. కి [సాక్షి] దొణయ [స] ఖ కండ బాకలు వేదరి బోళ వల్లయా
8. బు నంజు చాలుపట్టి [ల్లి] గాపుళ్లా, జంన్నపాబు అజ్జవపాబు

మూడవ ముఖం

9. వరిసాము పబు వచ్చుముళదే [దీ] నికి వక్రంబు వచ్చువారు పంచ
10. మహాపాతక సంయుక్తులగు ద్రు స్వదత్త [త్తాం] పరదత్తా[౦] వాయోహరేత
11. వసుంధరం [రాం] షష్ఠి [౦] వరుష [షన్] గ[9]

1. Read as Satyasraya
2. Read as Prithivivallabha
3. Read as Samvachharamulu
4. Seems to be Kaundinya gotra
5. మరుతుల్లు = భూ ప్రమాణాలు (Measures of land) P. No. 435 Early Telugu Inscriptions upto 1100 A.D.)
6. To Complete the verse add......
"హస్తాణి విష్ఠాయాం జాయతె క్రియః"

# కలకాలం, కల-కాలం

## శ్రీ రామగిరి శివకుమార శర్మ

ఈ నూటంకెల
గడియారపు డయల్లో
ఈ ముల్లు
వెనక్కి పరిగెడుతోంది.
చివరికి
చిన్న అర సెకను కూడా,
అందకుండా,
అటెటో వెళ్ళి,
ఆత్మహత్య చేసుకుని,
భూతమై,
వెక్కిరిస్తూ........
బాధిస్తూ........
జాడలేవు
గురుతులేవు
ఏదీ లేదు.
జీవులందరికీ,
"కల కాలం, కల-కాలం"
అన్న సమర్థన తప్పు.



# తొలి మెట్టు

## కేఎస్వీ

కాలం ఇంద్రజాలం చేస్తోంటే
కలం ఇంద్రచాపమై నానా వర్ణాల స్వప్నాల్ని
తోరణాలుగా అలంకరిస్తుంటే
నేడు - బాగుంటుంది.

నేను విన్నాను పాటలు
గొంతులు విన్నాను
వాద్యాలు విన్నాను
ఆలాపనలు ఆపాత మధురాలు
గాన రసాలు విన్నాను
విని మైమరిచాను.

సంగీతం చల్లిపోయిన మత్తుమందు
మనసుకు మరుల విందు.
సంగీతం వింటూ చనిపోవాలనుకొనే దనైక జీవి
స్పందనల దీవి సౌమనస్యాల బావి
అతని మనుగడంతా ఆకారం లేని పూలతావి
అతను పరిపూర్ణ జీవి.

సమస్యల్ని గుర్తుచేయకు
వాస్తవికత కత్తి దూయకు
ఆ కళాశీలి హృదయం తెగుతుంది
రక్తం మరుగుతుంది
వేదన అడుసులో అడుగు దిగుతుంది.

అడుసు తొక్కనేల ?
అవును, అంతా అడుసే కదా ఈ నేల !
తొక్కక తప్పేదెలా ?
తొక్కాడు పో అడుసు ఆ బేల
గొప్పకు పోయి కాలు కడుగక పోవుట యేల ?

వాస్తవిక జీవితం బురద మయమైతే
బురదను పట్టించుకోక తప్పదు
నిజాలతో ఊహను దట్టించుకోక తప్పదు
ప్రయత్నించి సందిగ్ధాన్ని
తుద ముట్టించుకోక తప్పదు.

సందిగ్ధ మంటేనే మెదుల్తాడు హామ్లెట్
అతనొక జీవన్మరణ సమస్యల టాబ్లెట్
మనుటా ?-
మరణించుటా ?
మౌలికమైన ప్రశ్న అది.
చంపటమా ?- మానటమా ?

అర్జునుడు లాంటి మహావీరుణ్ణి
అవస్థలపాలు చేసిన కీలకమైన ఘట్టం అది.

వ్యవస్థలు మారినా
అవస్థలు మారెనా ?
స్పందించే మనిలో
క్షణానికో హామ్లెట్ !
సంధించే ప్రతి ప్రయత్నం వెనుకా
సందేహించి చతికిలబడే అర్జునుడు !

కాలం ఇంద్రజాలం
పువ్వులా వికసిస్తూ
ముల్లులా గుచ్చుకుంటూనే ఉంటుంది.

ఆధునిక జీవిత కీకారణ్యంలో
మలుపు మలుపునా సమస్య.

ఇది ప్రశ్నార్థకం - అది ప్రమాద సూచన
అది 'నో వేకెన్సీ' బోర్డ్ - ఇది చీకటి చిచ్చుల భయం

బయలు దేరబోతుంటే కళ్ళముందు మెదులుతూంది
రైలు తప్పిపోతున్న దృశ్యం
చిందర వందరకూ గందరగోళానికీ-ఈ అధునికత
చిత్రమైన భాష్యం.

కాలం ఇంద్రచాపం
సింథటిక్ రంగుల స్వర్గాల్ని చూపెడుతుంది
అసలుకూ నకిలీకీ వారా తగ్గిన కళాప్రమాణాలు
భయపెడతాయి కలవర పరుస్తాయి
పట్టుబోయిన కుంచె
పామై కాటేస్తుంది
హృదయాన్ని - పాడమంటే పాడనంటుంది
మైక్ లేనిదే ఉత్తేజం రాదంటుంది.
గడియారాల్లో డిజిటల్‌గా తెలుస్తున్న ఈ కాలం
మీటనొక్కితే మూడుగా విచ్చుకునే గుచ్చుకునే శూలం.

బస్సుల గోలలో యంత్రాల శబ్దాలలో
సకలవిధ కలహాలఅసుర సంధ్యలో
అణుబాంబు తక్కెడ రాళ్ళ బరువులో
ఎవరికి వినిపించాలి సంగీతం ?
ఎవరందు కొంటారు ఆనంద సంకేతం ?

అలాగని పాడటం మాననా ఈ చైత్రవేళ ?
నా గళంలో కలంలో ఇప్పుడు దివ్యరసమేళ !
కానివ్వు 'రహదారి కాదు' అనే బోర్డులు
ఏదారిని చూసినా కనిపించ నివ్వు
కాళ్ళనంటిన బురదే
కలలకూ అంటనివ్వు
ముళ్ళబాధ లేకేంగాని
ఉంది గదా నాచేత పువ్వు
ఉందిగదా పెదవులమీద
సుందె దీపంలా వెలిగే నవ్వు
నేనొకణ్ణి కాను, పదుగురని, పలువురిని
నిరాశను మీటి ఆశను నర్తింపజేసే గడుసరిని.

కాలం ఇంద్రచాపం ఇవాళ నా మంత్రదండం
ఈ క్షణం నా ఈక్షణం లక్షణం
నిజాన్ని కలగనటం కాదు, కలను నిజపరచటం !
బద్ధకాన్ని పారద్రోలి
పద్ధతిని ప్రవేశ పెడుతున్నాను
చెదలు పుట్టలు పెట్టిన ఈ నేలంతా పూల
పొదల దట్టపు పచ్చదనాలతో నింపుతున్నాను
స్నేహాన్ని రాగరక్తిమనూ
ఈ చీకటినుండి పిండి అందిస్తున్నాను
గొంతులో కొత్త వగరుతో
స్వరానికి కోటి రంగులుగా పాడుతున్నాను.

మానవ చరిత్రంతా రక్తమయమనే సిద్ధాంతం
ఇకపై చలామణీ కారాదు
భవిష్యత్తుకు నేటి చరిత
కావాలి ఒక మధురమైన ఘనత
ముందుగా మనకుండ రాదు- మగత !

ఇంద్రజాలం చేసే కాలాన్నంతటినీ
చంద్రజ్యోత్స్నగా వెలిగిస్తున్నాను - రండి !

సౌహార్ద్రిమ పూలు పూయగా ఇచటినుండి
భవిష్యత్తును చూడండి !

కాపలసిందొకటే - ఐకమత్యం
స్వర్గం భూలోకం మీదే సత్యం
గా నిత్యంగా విలసిల్లటం తథ్యం !

నిఘంటువుల్ని సవరిస్తారు భవిష్యత్తులో
రాబోయే అపూర్ణ శరత్తులో

సవరిస్తారు నిఘంటువుల్ని భవిష్యత్తులో
మానవ సంబంధాలను గురించి....

'ప్రేమ' అనే మాటే ఉంటుంది
ఇంకొకటుట
మరో మాట

ప్రేమకు వ్యతిరేకమైన మరో మాట....
శోధించినా దొరకదు
మాట వరసకైనా ఆ మాట !

మోసం ద్రోహం వగైరా
ఆమాటకు చుట్టాలు - అవీ దొరకవు !

నిజపరచనా ఈ కలను ?
మార్చనా ఈ ఇలను ?

అయితే సరే - ఏమిటి నీవంతు ?

వినిపిస్తోందా నా గొంతు ?
ఏమిటి మరి నీ వంతు ?

ప్రకటించే ఈ స్వర్గప్రణాళికకు
త్యాగదీపిక లక్కరలేదు
రాగమాలికలే చాలు !

నేను - అనకు
మనం - అను.

మనం - అను
మనంగా మను.

నువ్వూ నేనూ వెరసి మనం.
వాడూ నేనూ వీడూ నువ్వూ కలిసి జనం.
ఈ భావన మనకు ఉద్దీపనం.

అంజనం కాదు లేపనం కాదు
ఎక్కవలసిన స్వర్గానికి
ఇదే మొదటి సోపానం.
వెయ్యాలి ఒట్టు అందరం
ఎక్కాలి ఈ మెట్టు సత్వరం.

కాలం
ఇంద్రజాలం
ఎన్నటికీ కరగని ఇంద్రచాపంగా
వర్ణ దీపంగా
శాంతి రూపంగా
ఇంద్రజాలం కాలం
మన పుడమి నట్టింట
ఉండిపోతుంది
మన నిండా అనుపమితంగా
అప్రమేయంగా నిండిపోతుంది
రేపటి బ్రతుకుల పచ్చదనంగా
పండిపోతుంది !



తే ॥ సంధ్ర దళ దాన పోపేంద్రుడగు నుపేంద
ధరణి వల్లభుఁడేరాజు తండ్రి తం డి
ఘను డుపేంద్రాఖ్యుఁ డెవ్వని గన్న తండ్రి
యతఁడు విశ్వేశ్వరుఁడు లక్కమాంబ సుతుఁడు.
(ఉల్లా. ౧. వ ౪)

విశ్వేశ్వరుని శాసనాల్లో పేర్కొనబడిన సర్వలోకాశ్రయ, రాజనారాయణ, ధరణీవరాహ, కరవాల భైరవ, రాయగండ గోపాల — మున్నగు బిరుదములన్నియు యీ గ్రంథమున నాతనికి వాడబడినవి.

సీ ॥ లక్ష్మీ ధరిత్య్రీవలాఃన ప్రౌఢిమ రాజనారాయణ ప్రథ
వహించి,
హవ్యకవ్యార్ధ నిత్య ప్రదాన వ్యాప్తి సర్వలోకాశ్రయ
క్షమతఁ జెంది,
త్రస్తశస్త్రాభి లోద్ధరణ క్రియాసిద్ధి ధరణీ వరాహ శబ్ద
మునఁబేర్చి
గర్వితారాతి విఖండనోదారతఁగరవాల భైరవ ఖ్యాతి
వడసి,

తే ॥ కదన భీతులఁ బుబుమేపి కాచి. రాయ
గండ గోపాల బిరుద సంగతిఁదనర్చి,
యవని, బొగ డొందు బహు విజయప్రవర్తి
చారుచాళుక్య విశ్వేశ చక్రవర్తి.
(ఉల్లా. ౧. వ. ౭)

పంచధారల శిలా శాసనంలోనూ, యీ గ్రంథంలోనూ సాద్రూప్యంగా కన్పట్టే కొన్ని విషయాల్నిబట్టి విన్నకోట పెద్దనే ఆ శాసనాన్నికూడ వ్రాశాడని నిస్సందేహంగా చెప్ప వచ్చు. శాసనంలో వేంగి చాళుక్యుల్ని పేర్కొంటూ—

"........తదన్వయే జాయత విష్ణు వర్ధ-
నఃసంవృర్ధ నో రాజ కులస్య సంతతేః ।
చళుక్యశై [తే]
తపసాభి నంద్ది తైర్దుర్గ్గాచ్యుతా ద్వైః కృతవిక్రమ-
స్తతైః ఆ సీ దింద్దు కులాగ్రణీజన పతిః
చ్చాళుక్య భీ
మేశ్వర స్తస్యక్షాత్ర పవిత్ర శైవపదవీ వృత్తం
విచిత్రం భు
వి । తేసై వాప్పి తవైభవాత్ ఖలు సదా చాళుక్య
భీమేశ ఇత్యాఖ్యా-
మా పద పూర్వి కామిహ కుమారా రామ భీమేశ్వరః
తద్వం-
శ్యో విమలా దిత్యో దిత్య పత్యారి విక్రమః ।
శశాసయశ-
సా సాంద్రాం వింద్య సింద్వంత రాంధరాం ।
తదాత్మజో

రాజ (౦) సరేంద్ర భూవరో భూ(ర్యా) భవద్రాజ
మహేంద్ర-
నామకః । తదాఖ్య యా రాజమహేంద్ర-
సంజ్ఞకం రమ్య-
౦ (పు) రండా జలి గౌతమీ తటీ । ............"

— అని వుంది. దీనిలో ఒక్క విమలాదిత్యుని విషయం మినహాయిస్తే మిగిలిన ముగ్గుర్ని రెండింట ఒకే పద్ధతిలో వర్ణించడాన్నిబట్టి వీటి కవి ఒక్కడే అని భావించటాన్కి వీలుంది. "ఇహైవోపేంద్ర భూభర్తేః సారూప్య పద భాజనం రాజశేఖర సర్వజ్ఞ శంకరత్వ మదాద్భవః" అని శాసనంలో విశ్వేశ్వరుని తండ్రి కన్వయించిన విషయాన్ని చూడామణిలో కృతిభర్త కనుక విశ్వేశ్వరునికే అన్వయించి—

శా ॥ "సర్వశ్రీఁదనపేరివాఁడగుటచే సంతుష్ట చేతస్కుఁడై,
సర్వజ్ఞత్వము రాజశేఖరతయున్ శంభుత్వము
న్విశ్వరా
ధోర్వీ భర్తకు విశ్వనాథుడు శివుండోజించెఁ ........"
(ఉల్లా. ౧ వ. ౫)

అని చెప్పటం జరిగింది. విష్ణువర్ధన బిరుదాన్ని "విష్ణువర్ధనకులస్తుడు" గా రెండింటిలోనూ పేర్కొనటం జరిగింది. వీటి యన్నింటి పోలికలు కన్నను ముఖ్యమైనది, చారిత్రకమైనది, రెండింటి యందును ఒకే విధముగా పేర్కొనబడిన సర్వసిద్ధి యుద్ధము. పంచధారల శిలా శాసనంలో—

(3) S.I.I. Vol. VI No.665. A.R.E. No.210 of 1899.

"గతి బాహు శక్తి భూమి తి మవి గణయుత్సర్వ సిద్ధి
పద భగ్నం
సతి చిత్ర భాను సాక్షిణి ధరణీ వరహాదధావ దాంధ్ర
బలమ్."

_అని పేర్కొనబడి, "గతి" శబ్దమునను నాలుగైదు లలో దేనిని స్వీకరింపవలెనో తేలని పరిస్థితులలో (4) చూడామణి యందలి ఒక పద్యమున-

"చతు రూపాయ బాహు శక్తి క్షమాపళి బాల విడిచి
చిత్ర భాను సాక్షి
బాల సర్వసిద్ధి పదమేది ధరణీ వరాహమునకు నోడి
రాచకదుపు."

అని యుండి సర్వసిద్ధి యుద్ధము జరిగిన సంవత్సరము క్రీ॥ శ॥ 1402 అని తెల్పుచున్నది. ఈ యుద్ధము జరిగిన చిత్ర భాను సంవత్సరము పై పద్యమునందేగాక
"చిత్రముపోర విశ్వ విభుచే...." (ఉల్లా. 3. ప ౧౩౦) అనియును,

"అని మొన విశ్వ భూ విభుని హస్త కృపాణము
చంద్ర హాసమ
య్యును మఱి చిత్రభాను...."(ఉల్లా. ౩. ప. ౮౬)

అనియు పలుమార్లు చెప్పబడినది. ఈ యీ సందర్భము లను బట్టి విన్నకోట పెద్దనే యీ శాసనమును కూడ వ్రాసె ననియు, నాటి రాజకీయ పరిస్థితులన్నియు నాతని కవగత ములే యనుమాట నిశ్చయము. కనుక యీ కావ్యాలంకార చూడామణి ఎంతటి లక్షణ గ్రంథమైనను, కవి కట్టెదుట నడచుచున్న చారిత్రక విషయములు కొలదిగా నైనను మనకీ గ్రంథమున లభింపకపోవు.

విశ్వేశ్వరుడు,లక్కమాంబ సుతుడు, సర్వలోకాశ్రయ చక్రవర్తి, రాజ నారాయణుడు, ధరణీవరాహుడు, కరవాల భైరవుడు, రాయగండ గోపాలుడు, లక్ష్మీ పుత్రుడు, ఉపేంద్రక్ష్మావరనందనుడు, చళుక్య విభుడు, పరగండ భైరవుడు, సోమకులాబ్ధి చంద్రుడు, సత్యాశ్రయుడు, నరేంద్రుడు, రాజనరేంద్ర వంశజుడు, మనుమోపేంద్ర తనూజుడు, విష్ణువర్ధన కులాబ్ధి చంద్రుడు. దుర్జయుడు, రాజేంద్రుడు, చళుక్యస్వామి, విష్ణువర్ధనుడు— మున్నగు నవి ఈ గ్రంథమున రాజునకు వాడబడిన ముఖ్య విశేషణ ములు.

మనకి ప్రస్తుతం లభ్యమౌతున్న విశ్వేశ్వర దేవుని శాసనాల్లో మూడు సింహాచల వరాహ లక్ష్మీనరసింహస్వామి ఆలయంలోను, మరొకటి పంచధారల ధర్మలింగేశ్వరుని ఆలయం లోను వున్నాయి సింహాచల శాసనాలు మూడింటిలో ఒకటి విశ్వేశ్వరుని సోదరియైన అంబికాదేవిది. మిగిలిన మూడు శాసనములు వరుసగా క్రీ॥ శ॥ 1377, 1401, 1407 సంవత్సరములకు చెందినవి.(5) వీనిని బట్టి విశ్వేశ్వరుని రాజ్యకాలము సుమారుగా క్రీ॥ శ॥ 1377- 1407 వరకు నుండునని భావింపవచ్చును. కాని మధ్యలో క్రీ॥ శ॥ 1391 లో యీతని దాయాదియైన ఎలమంచి చోడ గంగ దేవుడు సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజుగా ప్రకటించు కొనుటచేతను(6) , విశ్వేశ్వరుని పాలనలోనున్న ఉపేంద్ర వరములోని భూములను సింహాద్రి నాథునికి భోగముగా సమర్పించుటను బట్టియు నీతనిని క్రీ॥ శ॥ 1391 నుండి విశ్వేశ్వర దేవునికి సంయుక్త పాలకునిగా గతములో భావించుట జరిగినది (7) దీనినిబట్టి విశ్వేశ్వరుడు స్వీయ పాలనలో పదునాల్గు సంవత్సరములు, సంయుక్తపాలనలో పదహారు సంవత్సరములు మొత్తముమీద ముప్పదిసంవత్స రములు పాలించినట్లు తెలియుచున్నది. ఈ వంశస్థుల్లో అతి సమర్థుడుగా పేరెన్నిక గన్న విశ్వేశ్వరుడు క్రీ॥ శ॥ 1391 నుండి 1407 వరకు ఎందువలన తన దాయాదితో సంయుక్తముగా పాలింపవలసి వచ్చినదో స్పష్టముగా తెలియదు. ఈ విషయం చూడామణిలోని ఒక పద్యం ద్వారా కూడ బలపడుతుంది.

చ ॥ "అరుదగు రాజ్యతంత్రమున యప్రిమి ము చేతికి నిచ్చి
విశ్వ భూ
వరుండఖిలాంగ సుందరియు వారణయానయు
నిత్యదృజ్మనో

(4) Epigraphia Indica, Vol. XIX P. 164.
" " Vol. XXV P. 335.

(5) S.I.I. Vol No. 655, 840, 919.
(6) S.I.I. Vol. VI. No. 70 ; A.R.E. 249 of 1899.
(7) భారతి.సెప్టెం. 1980,పే.28; J.A.M.R.S. Vol. XXVII.

హరయును సైతనర్చు విజయాంగన తోడిద లోకమై
నిరం
తరము సుఖించుచుండు నవ దర్పకుఁడై సుభగత్వ
మేర్పడన్."
(ఉల్లా. 3. ప. ౧౦)

కనుక విశ్వేశ్వరుని పాలన ద్వితీయార్ధమున చోడ గంగుని నాచరిక భాగస్వామ్యము నిరభ్యంతరముగా గుర్తింప దగినది. బహుశః ఆనాటి రాజకీయ పరిస్థితులే యీ సంయుక్త పాలనకు కారణంగా ఊహించుకోవచ్చు.

తరువాత గమనింపదగినది చిత్రభాను నామ సంవత్సరమైన క్రీ॥ శ॥ 1402 లో, ఎలమంచిలి కారు మైళ్ళ దూరములో నున్న సర్వ సిద్ధి కడ జరిగిన భీకరయుద్ధము. ఈ యుద్ధమున విశ్వేశ్వర దేవుడు ఆంధ్ర బలాల్నెదిరించి నట్లు కావ్యాలంకార చూడామణిలోను, శాసనాల్లోనూ కూడ వర్ణింపబడింది. చూడామణిలో చాల పద్యాలు విశ్వేశ్వరుని శౌర్యపరాక్రమాల్ని, యుద్ధోద్ధతిని పేర్కొనేవే. వీటిలో ముఖ్యమైనవే నలభై పద్యాలవరకు ఉన్నాయి.

క ॥ ధరణీ వరాహు భేరీ
విరావ మాలించి, వైరి వీరులు వికృతా
తురులై, సాగర గిరి సరి
దరణ్య దుర్గ స్థలముల కరుగుదు రోలిన్.
(ఉల్లా. ౧. ప. ౯౮)

క ॥ కరవాల భైరవుని యని
నరి చావక చచ్చినట్లు యిటు పడి యుండెన్
పోరి నూర్పులణంచి ఱెప్పలు
మరలింపక గాజు వాతి మాన్పడి భీతిన్.
(ఉల్లా. ౧. ప.౧౧౦)

చ ॥ ఒరసి చళుక్య భూపతికి నోడిన వైరికిఁ గాననంబులోఁ
గరి మద గంధము ల్గదిల కంటక రేఖలు ఘర్మితాంగ
మున్
సురత వికార లీలఁ దల చూపినఁ దత్సతి యల్కఁ
జెందెఁ ; ద
ద్వరుఁడునుఁ దేటగాఁ దెలిపె ; వక్రత నమ్మద యెన్ని
చెప్పినన్.
(ఉల్లా. 3. ప. ౨౨)

మ ॥ అతి కుప్యత్పర గండ భైరవ మహద్యతఖడ్గముగ్రా
కృతిన్
ప్రతిపక్ష ప్రకరంబునొంచె, నలంచున్, ఖండించు,
దండించు, ను
ద్ధతి నుగ్గించు, వధించు, ప్రచ్చు, యమదోర్దండ
ప్రచండక్రియా
గతి రూపించు, నటత్కబంధము యి సంగ్రామంబు
భీమంబుగాన్.
(ఉల్లా. ౪. ప. ౩౨)

మ ॥ అతి దృప్య త్కరవాల భైరవ పతాకా భీల కోలధ్వజా
కృతులం జూచిన వీరులుబ్బుదు రొగిం గీర్వాణ
లోకార్థులై,
సతతత్రస్తులు దూలి పోదురు మహా శైలాగ్ర
కూటార్థులై,
గత విద్వేషులు విశ్వనాథ వినుతుల్లావింతు రాత్మా
ర్థులై.
(ఉల్లా. ౪. ప. ౩౬)

— వీనినిబట్టి యొక్కటి మాత్రము స్పష్టము. సర్వ సిద్ధిలో విశ్వేశ్వరుడు జయించినది సామాన్యమైన యుద్ధము కాదు. శత్రువెవ్వడో ఒక నామ మాత్రపు రాజును కాడు. "బిరుదములు పెట్టుకొని తుది బిరుదార్థము నిల్పలేని బిరుసు నృపుల"తో నిండిన "రాచకదుపు." ఇక యుద్ధ కారణం "అన్యపుర దాహప్రౌఢి". ఈ భీకర యుద్ధం సర్వసిద్ధి ప్రాంతాల్లో సముద్రతీరంలో జరిగినట్లు భావించటానికి వీలుంది.

"క్రొత్త పెండ్లి కొడుకై మదినుబ్బుచు నుండు సాగ
రుండు" (ఉల్లా. ౪. ప.౫౨)

"జలద స్పష్ట కృతాంతదండమునునై సంగ్రామ
రంగంబులో" (ఉల్లా. ౫. ప. ౩౮)

"నభ ద్వీప పతీ తరంగములలో నాడించుఁగ్రీడా
గతిన్" (ఉల్లా. ౪. ప. ౯౩)

— మున్నగు సూక్ష్మాంశాలు పై విధంగా భావించ టానికి వీలు కల్గిస్తాయి.

అయితే విశ్వేశ్వరునితో మర్షణకు దిగిన శత్రువర్గ మెవరో శాసనములందు వెల్లడికాలేదు. కాని చిత్రభాను నామ సంవత్సరమైన శక సం॥ 1324 (క్రీ॥ శ॥ 1402) న జరిగిన ఆ పోరాటమున విశ్వేశ్వరుడు "విజయలక్ష్మీ కర గ్రాహకు" డయ్యెను. ఈ శత్రువులు 'ఆంధ్రేశ్వరుల' మని బిరుదనామములు ధరించిన వెలమ పాలకులు గాని, రాజ మహేంద్రవర రెడ్డిరాజులుగాని కావచ్చును. ఈ సందర్భంలో చూడామణిలోని ఒక అంశం ప్రత్యేకంగా పరిశీలింపదగ్గది.

"........................ ........ ...నవ్వైరి మా
త్స్యాని చందంబునఁ బాండ్య భంగి ద్రవిడక్షోణీశు భావంబునన్
జను దీనుండయి హీనుఁడై కృపణుఁడై సంతప్తుఁడై లుప్తుఁడై."

[ఉల్లా. అ. ప. ౯౮]

మత్స్యాలు వీరికి దగ్గర వారైన ఒడ్డాది పాలకులు. వారితో వీరికెట్టి కలహములును సంభవించినట్లు చెప్పుట కాధారములు లేవు. ఈ పాండ్య, ద్రవిడ క్షోణీశులెవరో ఏ సందర్భమున మత్స్య రాజుల తోడ్పాటు వారికి లభించెనో, ఎలమంచిలి విశ్వేశ్వరదేవుడు వారి నెదుర్కొని ఎందువలన పరాభూతులను చేసెనో తెల్సుకొనుటకు ప్రస్తుతాధారము చాలదు.

పంచధారల శిలా శాసనంలో విశ్వేశ్వరుని మంటప నిర్మాణాదుల్ని పేర్కొంటూ ఉపేంద్రపురమున విష్ణు ప్రతిష్ఠ చేసినట్లుగా చెప్పబడుతుంది. దీనిని ప్రస్తుత విశాఖ జిల్లాలోని 'ఉప్మాక' గా గుర్తించటం జరిగింది [8]. దీనికి సమీపముననే 'గోకులపాడు' నామముతో, కావ్యాలంకార చూడామణి ఏడవ ఉల్లాసపు అంపై అయిదవ పద్యమున వర్ణింపబడిన 'గోస్థానము' కలదు [9].

సింహాచల శాసనంలో విశ్వేశ్వరుని భార్య 'మను మయ దేవి' అని పేర్కొనబడింది. ఈ గ్రంథంలోని తృతీయోల్లాసంలో ప్రగల్భ ధీర లక్షణానికుదాహరణగా ఒక 'మణి పుత్రిక' వర్ణింపబడింది విశ్వేశ్వరుని తల్లియైన 'లక్కాంబిక'ను 'లక్ష్మీదేవి'గా చెప్పినట్లే మనుమయదేవిని మణి పుత్రికగా చెప్పియుండెనేమో !

ఇంకా యీ గ్రంథంలో సమకాలీన సంస్కృతీ విషయాలు, సామాజిక నిత్య జీవన వివరాలు చాలవరకు లభ్యమౌతాయి. సాధారణంగా స్త్రీలలంకరించుకొనే అలంకారాలు, లలాట రేఖగని బొట్టిడుట నేత్రములకు గజ్జలంబిడుట, నిలువుటద్దములు, పై మాళపుటాటవంటి క్రీడా విశేషాలు, జల యంత్ర కర యంత్రాలు, వధూలావణ్యమును పటముల మూలముగా తెల్సుకొనుట, నవరస గీత వాద్యనటనలు, అభినయము, ఏలాది ప్రబంధములు పాడుట, కాదంబరి గోష్ఠి- మున్నగునవి వర్ణించి చెప్పబడ్డాయి.

లలిత కళల పోషణ ఎంత పరిపూర్ణంగా వుండేదో మనకి గ్రంథంలో విశదమౌతుంది. ఈ కాలంలో ఇరుగు పొరుగు రాజ్యాల్లో సంగీత నాట్యాలు పుష్కలంగా వెల్లివిరిసినట్లు సింహాచల శాసనాలు తెల్పుతున్నాయి. క్రీ॥ శ॥ 1368 ప్రాంతాల్లో జంతర్నాటి సీమను పాలించే ప్రతాప వీరగాంగ రాజు "సత్కాళావాన్ సంగీతజ్ఞో" అని వర్ణింపబడినాడు. మాచిరాజు కుమారుడుకృష్ణభూపతి "స్సంగీతాంబోధి చంద్రస్స కళ గుణనిధిర్వేద శాస్త్రప్రవీణః" అని కీర్తింపబడినాడు. [10] ఈ కాలంవాడే అయిన శ్రీనాథుడు హిందోళ, ఘంటారవ, శంకరాభరణ రాగాల్ని పేర్కొన్నాడు. తన కృతి భర్తను కూడ వారెవరికీ తీసిపోని విధంగా చెప్పాడు పెద్దన. విశ్వేశ్వరుడు స్వయంగా సంగీత సరణి 'నేర్చిన గాంధర్వ కళాకోవిదుడు. అలాంటి కళాహృదయుణ్ణి సాహిత్యంలోనే గాక సంగీతపరంగా కూడ చెప్పిమెప్పించాలనే ఉద్దేశ్యంతో కవి సరిగమల్తో స్తుతించాడు. [11]

[8] భారతి- 1980 సెప్టెం. పే. 8
[9] ఆంధ్ర పత్రిక- 1925.
[10] ఆంధ్ర పత్రిక- 1942-43, పే. 27

[11] ఇది కల్యాణి రాగంలో రూపక తాళంలో పాడితే శ్రావ్యంగా ఉంటుందని, తమకు చిట్టిబాబు పాడి విన్పించినట్లు 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం'-IV లో ఆరుద్ర వ్రాశారు.

క॥ "నీ సరి పని నీ సరి ధని నీ సరి మాధారి గరిమ నీ
సరిగారీ
నీ సరిగా నిగ మాగమ గో సారులునుం జళుక్యకుల
విశ్వేశా."
[ఉల్లా. ౬. ప. ౬౩]

రాజాస్థానంలో నర్తన,అభినయం ఎంత కళాత్మకంగా వెలుగొందేదో చెబుతూ-

చ॥ "కనుగొన నొప్పు కంఠమున గానము, బాణలం
మంజులార్థ క
ల్పనమును, దృగ్విశేషమున భావములుం, జరణ
క్రమంబులన్
దనరులయ ప్రపూర్ణమగు తాళము, గ్రాలఁగి బ్రాత
యోర్తు రం
జనముగనాడె నింపు వెదచల్లుచు విశ్వ నృపాలు
సన్నిధిన్."
[ఉల్లా. ౨. ప. ౨౭]

-అని వర్ణించాడు.

మరో సందర్భంలో తెలుగు భాషపై ఆనాటికున్న ఇతర భాషా ప్రభావాన్ని కూడ సూచిస్తూ 'బిరుద' శబ్దం మహారాష్ట్ర భాషకు చెందినదని తెల్పాడు.

ఈ విధంగా 'చతురతతో' వివిధ భాషా ప్రసంగాల చందంలో 'అందం'గా వ్రాసిన యీ గ్రంధంలో శాసనస్థ విషయముల కపవాదము కాని రాజకీయాంశములు, శాసనాల్లో చెప్పబడని ఎన్నో సాంఘిక జీవనవిషయాలు పేర్కొనబడి చరిత్ర నిర్మాణంలో సాహిత్యపు విశిష్టతను ఋజువు పరుస్తున్నాయి.



# పర్దతీయము ప్రేయసీ !

## శ్రీ వెల్దుర్తి మాణిక్యాలరావు

ఇద్దరమె ఉన్నాము ఇచ్చట
పర్దతీయము ప్రేయసీ !
రూపు రేఖలు చూసుకొందము
రేపు మాపనుటెందుకు.
లోన కుములుతు మధనపడుతు
వ్యధల దాచుట ఎందుకు ?
మనసులోని మాటలన్నీ
మూటగట్టుట ఎందుకు.

చెప్పుకొందము లేక అరమర
హృదయ వేదన ఉభయులం
విప్పుకొని మన మనసు మూటల
ఒప్పులను బేరీజు వేతము
చుక్కలను లెక్కించి రాతిరి
విరహాగ్నిలో కరిగించి వాటిని
ఉదయమే వెలిగించి వేతము
ఆకసములందరుణ గోళము.

....⋮....

కీ॥ శే॥ వేలూరి శివరామశాస్త్రిగారు

# కర్మవాదము

గీతాకారుని కర్మనుగూర్చి చాల మతభేదము కలదు. మిగుల తక్కువతరగతి సాధకులకే కర్మ యనికొందఱందురు. ముక్తపురుషులు కూడా కర్మ చేయుదురని కొందఱందురు. కావున ఈ విషయము ఆలోచనీయము.

## కర్త ఎవడు?

కర్మ చేయున దెవఁడు? మానవుఁడే! మానవ, మానుష, పురుష, నర, జనాదులగు పదములు ఏకార్థవాచకములు. ఈ పదము లన్నియు 'దేహముతోఁ గూడిన ఆత్మ' అను అర్థమున వాడఁబడుచుండును. కాని గీతలలో (అచటనచట) నొక్కకచో ఆత్మదెసను, ఒకొక్కచో దేహము దెసను మొగ్గు కనిపించుటయే కాక ఆత్మ దేహముల రెంటియెడను గూడ తూకము సమానముగా నున్నటులు కానిపించును. కావున మానవుఁడు కర్మ చేయుననినంతనే ఆత్మ కర్మచేయునని అనుకొనుటకువీలులేదు. గీతల ఆత్మనిష్క్రియము—ఆత్మ కర్మ చేయను చేయదు, చేయునులేదు. కర్మ చేయునది ప్రకృతి, కర్మ చేయునది దేహము, మఱియు ఇంద్రియము మొ.

## గుణములకార్యము

గుణములు మూడు - సత్త్వము, రజస్సు, తమస్సు. సత్త్వగుణము ప్రకాశాత్మకము. నైర్మల్యము శమముతపము శౌచము క్షాంతి ఆర్జవము జ్ఞానము విజ్ఞానము ఈ మొదలగునవి సత్త్వ గుణమువలన ప్రకాశితములగును. (౧౪-౬; ౧౮-౧౪ ఇత్యాది) ఈ గుణము మానవుని జ్ఞానమునందును సుఖమునందును ఆసక్తునిజేసి బంధించును. ప్రవృత్తి తృష్ణ అశాంతి స్పృహ కర్మరంభము ఈ మొదలగు గుణములు రజస్సు నుండి పుట్టును. (౧౪-౭, ౧౨) దీనివలననే కర్మయందు ప్రవృత్తియు ఆసక్తియు కలుగును. మోహము అజ్ఞానము ప్రమాదము ఆలస్యము ఈ మొదలగునవి తమస్సు నుండి పుట్టును (౧౪-౮) ప్రకాశము సత్త్వకార్యమనియు, మోహము తమః కార్యమనియు సంక్షేపము. చూ (౧౪-౨౨)

ఈ మూఁడు గుణములచే అవ్యయుఁడగు ఆత్మయు తెలియని చందముగా సంసారమునం దిఱుకుకొని యున్నాడు. (౧౪-౫)

## గుణాతీతావస్థ

దేహి యెపుడీ గుణముల నతిక్రమించునో అపుడు జన్మ జరా మృత్యు దుఃఖములకుఁ బాసి అమృతత్త్వ మొందును. (౧౪-౨౦)

ఈ పృథివి మీద నివసించియు మానవుఁడు గుణాతీతుఁడు కావచ్చును. గుణాతీతుని లక్షణమునుగూర్చి గీత యిటుల చెప్పెను. గుణాతీతుఁడు ప్రకాశముగాని ప్రవృత్తిగాని మోహముగాని గొడచూపినపుడు ద్వేషింపడు; నివృత్తము లయినచో కోరఁడు. (౧౪-౨౨) గుణాతీతుఁడు ఉదాసీనునివలె నుండును, అతఁడు గుణములచే కలఁతగొనఁడు, గుణములే తమ పనులు తాము చేసికొనుచున్నవని యెఱిఁగి తానచంచలుఁడయి యుండును. అతఁడు తనలోనే తానుండును; అతఁడు ధీరుఁడు; అతనికి మట్టియు బంగారము నొకటి; సుఖదుఃఖములు, ప్రియాప్రియములు, నిందాస్తుతులు, మానావమానములు, శత్రుమిత్రులు ఇవన్నియు నతనికి తుల్యములు. అతఁడు సర్వారంభపరిత్యాగి. (౧౪-౨౩, ౨౫; ౧౨-౧౬)

జీవన్ముక్తుఁడు పాపకార్యములు చేయఁడనియు, పుణ్యకార్యములు చేయుననియు కొందఱనుకొందురు గాని ఈ మతము సరియైనదికాదు అతఁడు శుభాశుభములను [౧౨-౧౭] సుకృత దుష్కృతములను [౨-౫౦]

రెంటిని విడనాడును. సాధువుల యెడను పాపులయెడను అతనికి సమాన దృష్టి. [౩-౯]

ముక్తావస్థ యొక్క గౌరవము నుద్ఘోషించుటకే ఇట్టి భాష ఉపయోగింప బడెననియు, ఇది యెల్లయు స్తుతి యనియు కొందరు తలంతురు. ఇది చెడ్డ భ్రమ. ఈ చెప్ప బడిన దంతయు గీతల మూలతత్త్వపు పరిణామము. గీతల మూల తత్త్వమిది-

'దేహము ఇంద్రియములు మనస్సు బుద్ధి అహంకారము ఈ మొదలగున వేమియు ఆత్మకావు; ఆత్మవియుకావు. ఈ సముదాయ మెల్లయు ప్రకృతి యొక్క వికారము. కార్యము చేయున వింద్రియాదులు. వేఱువేఱు గుణముల ప్రభావమువలన వేఱువేఱు కర్మసంపాదిత మగును. సత్త్వ గుణమువలన పుణ్యాది కర్మయు, రజస్తమోగుణములవలన పాపాది కర్మయు తయారగును పాపపుణ్యములు రెండును గుణముల నుండి పుట్టినవనియును , గుణములు ప్రకృతి నుండి పుట్టిన వనియును, ఈ ప్రకృతియు ఈ ప్రకృతి నుండి పుట్టిన గుణములును ఆత్మకంటె వేఱనియును ఒప్పు కొన్న యెడల పాపపుణ్యములు ఇసుమంతయు ఆత్మవి కావనియును ఆత్మకు వీని స్పర్శయే లేదనియును ఒప్పుకొన వలయును ఈ గీతామతమును ఈ క్రిందిదృష్టాంతముచే స్ఫుటీకరింతును. ఉదాసీనుండగు మనుష్యుడొకం నది యొడ్డున నిల్చియున్నాడు. అది ప్రవహించి పోవుచుండుట చూచుచున్నాడు. ఆ ప్రవాహము తనదను జ్ఞానమతనికిలేదు. అందలి నీరు మఱికిదయినను తేటదయినను అతనికి సమానమే. ఇందేదియు నతనిని స్పృశింపదు. ఆ రీతిగనే ముక్తుండును కర్మనది యొడ్డున నిల్చియున్నాండు; కర్మ ప్రవాహము పరుగెత్తుచుండుట అతండు చూచుచున్నాండు. అతనికి దాని యెడ అహంతలేదు, మమత్వములేదు; అది పాపముచే పంకిలమయినను. పుణ్యముచే స్వచ్ఛమయి నను రెండును అతని కొకటియే; ఏదియు అతని నంటదు. అతండు ఉదాసీనుండై నిలిచియుండెను.

## ముక్తుని కర్మ

మనము ఆత్మకు మూండవస్థలుకల్పించుకొనవచ్చును. ౧ దేహముక్తి ౨ జీవన్ముక్తి ౩ బద్ధావస్థ. ఇందు విదేహ ముక్తితో కర్మకేమి సంబంధమో ముందు విచారింతము. ఈ యవస్థలో ఆత్మ విదేహము ఇంద్రియాతీతము మఱియు గుణాతీతము. ఇంద్రియములును గుణములును ఉన్న చోటనే కర్మయుండును. ఇవి లేనిచోట కర్మయుండదు. కావున ముక్తునకు కర్మలేదు. ఈ యవస్థలో ఆత్మ అకర్త.

## జీవన్ముక్తుని కర్మ

దేహము వదలకమునుపును మానవుండు ముక్తిం బడయవచ్చును. దీనికే జీవన్ముక్తి యనిపేరు. జీవన్ముక్తులు గుణాతీతులు.

కర్మకు మూలము గుణము. కర్మ చేయవలయునని పుట్టుకోరికకును కర్మ చేయవలయునను ప్రవృత్తికిని కర్మారంభమునకును మూలము రజోగుణము (౧౪-౧౨) రజోగుణము లెస్సగాపెరిగి చచ్చువాండు కర్మాసక్తులలో పుట్టును. (౧౪-౧౫)

మానవుండెపుడు జీవన్ముక్తుండో అపుడు గుణాగుణము లతని నేమియు చేయలేవు. కావున రజోగుణమునకుంగూడ నేమియు పనియుండదు. కాంగా అతండు కర్మయందు ప్రవృత్తుండును కాండు; ఆసక్తుండునుకాండు.

జీవన్ముక్తుడును దేహధారియేకదా, అతనికిని ఇంద్రియములు మనస్సు బుద్ధి యివి యన్నియు నున్నవికదా; అతఁడు కార్యము చేయుఁడని యనఁగా నర్థమేమి ? యని కొందఱందురు. జీవన్ముక్తునకు దేహేంద్రియాదులున్నను లేనట్లే. ఇంద్రియములే యింద్రియ విషయమున ప్రవర్తించుచున్న వనియును తానేమియు చేయుటలేదనియును అతఁడనుకొనును (ప్రకృతికర్మ చేయుచున్నది; తాను అకర్త (౩-౨౭; ౫-౧౩; ౧౪-౨౩ ఇత్యాది) తానెల్లపుడు ఉదాసీన భావముతో నుండును. (౧౨-౧౬; ౧౪-౨౩) ఇంద్రియాదులు కర్మయందు ప్రవృత్తమైనపని అతనికి వాని యెడ ద్వేషములేదు: నివృత్తమైనపని వానియెడల కోరిక లేదు. (౧౪,౨౨,౨౩) ఆత్మరతునకు ఆత్మతృప్తునకు ఎట్టి కోరికయు నుండదు. [౩-౧౭] ఇహలోకమునందు కర్మచేగాని, కర్మత్యాగముచేఁగాని అతనికే ప్రయోజనమును కావలసిన పనిలేదు. అతఁడు కేవలము శారీరకమగు కర్మ చేయును. కాని దీని యెడ గూడ నతనికి మమత్వము లేదు" [౪-౨౧] అతఁడు సర్వారంభ పరిత్యాగి. [౧౪-౨౫] గీతలలో చెప్పిన చొప్పున నుండు పురుషవరేణ్యుఁడు ఎటుల కర్మయందు అనాసక్తుడో అటులు కర్మత్యాగమునందును అనాసక్తుఁడు జీవన్ముక్తుఁ డిట్టివాడు.

## బద్ధ జీవుల కర్మ

కర్మ జగత్తులో మనము బ్రతుకుచున్నాము. మనకు కాలుసేతులు గలవనియు, పనిచేయవలసి యున్నదనియు కార్యమునందు ప్రవృత్తియుఁగలదనియు మనము తలచుఁచున్నాముః మనము పని చేయుదుము ; సుఖదుఃఖములలో తగులుకొందుము ; సంసారములో మునిఁగి తేలుచుందుము. ఇదియే బద్ధదశ. కర్మ జగత్తు బంధన జగత్తు ; కర్మ బంధన మోక్షమే మోక్షము.

కర్మమే బంధనమునకు కారణమనుచో కర్మ త్యాగ మొసరించినంతనే బంధనము నుండి ముక్తిబడయనగునా యని కొందఱందురు.

౧

## : కర్మ త్యాగ మసంభవము :

గీతా కారుఁడు కర్మ పీడుటకు వీలులేదను — "పని చేయనిచో జీవయాత్రము జరుగదు" (౩-౮)

౨

"పని చేయక అరనిముసమేని ఎవఁడును ఊరక ఉండఁజాలఁడు. ప్రకృతి నుండి కలిగిన గుణములు (రాగద్వేషాదులు) అందఱను అవశుఁజేసిపనిచేయించును" (౩-౫)

"ఇచ్ఛ లేకున్నను రజోగుణమునుండి పుట్టిన కామక్రోధాదులు కార్యమునందు నియోగించును." (౩-౩౬, ౩౭)

కావున మనుష్యుఁడు పనిచేయనిదే బ్రతుకలేకపోవుటొకటి, తనకు ఇచ్ఛలేకున్నను గుణములచే బలవంతముగా కర్మ చేయింపఁబడుటొకటి, కానవచ్చెడిని.

౩

## : ఇంద్రియ నిగ్రహము :

ఇంద్రియాసక్తియే అనిష్టము లన్నింటికి మూలమయిన యెడల ఇంద్రియ నిగ్రహ మొనరింపరాదా? దాన ఈ బంధనము లన్నియు తెగిపోవునుగదా అని కొందఱందురు.

ఇంద్రియ నిగ్రహముచేఁ ఈ యుద్దేశ్యము సిద్ధింపదని గీతాకారుఁ డనును. మనుష్యుఁడు తన ప్రకృతిని బట్టియే పని చేయుచుండును. ఆత్మ ప్రకృతితో కలిసియున్నది. ప్రకృతి వేఱువేఱు తెగల మనుష్యుల జీవనములలో వేఱువేఱు తెగల పనులు చేయుచున్నది. కొందఱు సత్త్వ గుణ ప్రధానులు. మొత్తముమీఁద తమోగుణమే యెక్కువ పని చేయుచుండును. జ్ఞానవంతుఁడు కూడ సహజముగా ఈ గుణముల నతిక్రమింపలేఁడు — "జ్ఞానవంతుఁడును తన ప్రకృతి కనురూపమగు కర్మ చేయుచుండును. ప్రాణులు ప్రకృతికి అనువర్తుఁగుదురు. నిగ్రహమేమిచేయఁగలదు ? [౩-౩౩]

మనుష్యుఁడు బయట కర్మచేయకున్నను మనసు లోపల చేయునెడల అది త్యాగములేకాము-కర్మేంద్రియముల బిగ్గఁబట్టి మనస్సున విషయములను తలపోయు మూఢునిపని మిధ్య. (౩-౬) ఇచ్ఛ, కామన, ఆసక్తి, సుఖస్పృహ ఈ మొదలగునవి కర్మరూపముగా ప్రకాశము చెందును. లోపలి భావమునకు బయటి రూపము కర్మ. ఒక వేళ బయట రూపము అనఁగా బాహ్యప్రకాశము లేకున్నంత మాత్రమున లోపల ఉద్దేశము (భావము) లేదని అనుకొనుటకు వీలు లేదు. కర్మేంద్రియములు నిగ్రహింపఁబడినను

లోపలనున్న వాసనలు కార్యము చేయుగలవు. దీని వలన గీతాకారుఁడు ఇంద్రియ నిగ్రహము యొక్క శ్రేష్ఠత్వ మంగీకరింపలేదు.

౪

## కర్మవలన నైష్కర్మ్యము

కర్మచేయుట మొదలిడనిచో నైష్కర్మ్యము సిద్ధింపదనునది గీతాకారుని విశేషమతము.

నైష్కర్మ్యమనగా కర్మరాహిత్యమని ముఖ్యార్థము. కర్మానుష్ఠానము చేయనిచో కర్మ రూపుమాయు అనునదొక పరీక్షిత సత్యము. ఇంద్రియములకేదో యొక పని అప్పగింపనిచో అవి వశము కావను నటు లీ మానవ జీవితమేర్పాటు చేయఁబడినది. పలువురకు తీవ్ర వైరాగ్యము కలుగును. వారు దాని నవలంబింతురు కాని అనేక సమయములందు తీరని కోరికలును, పొందని సుఖములును వీరి ప్రాణములను ఊగులాడించి వైచును. తగిన భోగము కలిగిననే త్యాగము సహజముగా సులువగును. (౬-౧౬-౧౭) తొలుతనే సన్న్యాసము గొన్నచో సులువుగా సిద్ధిబొందుట అరుదు - 'న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి' ౩, ౪. దీనఁజేసియు గీతాకారుఁడు కర్మానుష్ఠానమునకు వ్యవస్థ చేసెను.

## యోగము - కర్మ

క

పరమాత్మ నిష్క్రియుఁడు. ముక్తుడును నిష్క్రియుఁడు. కాగా జీవన్ముక్తునకు కర్మలేదు. సాధనల కన్నిటికిని ముక్తియే లక్ష్యము కావున సాధకుడు కర్మాతీతుఁడయియే తీరవలెను. అటులయినను మనుష్యుఁడు కర్మ చేయక ఉండఁ జాలఁడని గీతాకారుడు చెప్పుచున్నాఁడు. "కర్మ త్యాగమసంభవము. అటులయినను కర్మాతీతుఁడయి యుండవలసియుండును— ఇది యెటులు పొసఁగును ? ఇందులకు గీతాకారుఁడిటులనుచున్నాఁడు. 'యోగస్థుఁడవయి కర్మ చేయుము.' [౨-౪౮]

గీతలలో యోగమొకటి ముఖ్యమగు విషయము. సమత్వము యోగము. [౨-౪౮] సమత్వమనఁగా అంతరింద్రియము యొక్క సమావస్థ, స్థిరత, ప్రశాంతి ఈ మొదలయిన ధర్మము. యోగమనఁగా బుద్ధియోగమనియు ౨-౪౯ లో వ్యవహరింపఁబడెను. కొందఱు కర్మ చేసియు ముక్తులు. కొందఱు కర్మ త్యాగము చేసియు బద్ధులు. ఈ విషయమున గీతాకారుఁడిటులు అనుచున్నాడు - కర్మఫలము కోరక యెవఁడు చేయఁదగిన పనిని చేయునో, సన్న్యాసికాని యోగికాని అతఁడే. నిరగ్నియును అక్రియుఁడును అగువాడు సన్న్యాసియు కాఁడు, యోగియు కాఁడు. (౬-౧)

సాధకుఁడు యజ్ఞము చేయక నిరగ్ని కావచ్చును, అనగా అగ్నిహోత్రము ఉంచుకొనకుండ నుండవచ్చును. పూర్తాది కర్మలను చేయక అక్రియుఁడు కావచ్చును. కాని అతఁడు కోరికను ఆసక్తిని వదలఁజాలనిచో కర్మ త్యాగము చేసియు కర్మాసక్తుఁడే. ఎవని మనోబుద్ధి చిత్తములు సంయుతములగునో అతఁడనాసక్తుఁడు. అతఁడు కర్మ చేసినను సన్న్యాసియే. బాహ్య కర్మానుష్ఠానముగాని త్యాగముగాని అవాంతర విషయము. కావలసినది యోగయుక్తావస్థ. దీని కొఱకు గీతాకారుఁడు కర్మ బుద్ధియోగము కన్న తక్కువ అని చెప్పెను- "బుద్ధి యోగముకన్న కర్మ చాల తక్కువ" (౨,౪౯,) యోగయుక్తునిపై కర్మ ప్రసరింపదు. దీననే కర్మకన్న యోగము మిన్న గీతల మతమున యోగి తపస్వులకన్న, జ్ఞానులకన్న, కర్మిష్ఠుల కన్న మిన్న. (౬-౪౬)

ఖ

కుశలత లేనిచో ఏ పనియు చక్కగా పూర్తి కాదు. (కుశలత యనఁగా నేర్పరితనము లేక ఉపాయము) యోగమను ఉపాయమవలంబించుచో మనుష్యుఁడు కర్మబంధనమున పడకయే కర్మ చేయవచ్చును. దానఁ జేసి యోగము కౌశలమని చెప్పబడెను- "కర్మలలో కౌశలము యోగము" (౨-౫౦) ఇందులకు కొన్ని ప్రమాణములు :

ఆత్మ యే పనియు చేయదు, పనిచేయునది ప్రకృతి. కాని తెలియక మానవుఁడు "నేనే పనిచేయుచున్నాఁ"డని అనుకొనును. ఎఱుక నొందినవాఁడు ప్రకృతియే, పనిచేయుచున్నదని తెలిసికొనును. ఈ యవస్థలో అతని కేపని యందును మమత్వము లేదు. అపుడు లోకులు "అతఁడు అనాసక్తుఁడై పనిచేయుచున్నాఁడు" అని వారి భాషలో

అనుకొందురు. ఇందులకు గీతలలో పెక్కు ప్రమాణము లున్నవి. ఈ క్రింద కొన్ని ఉదాహరింతును.

(క) ప్రకృతి యొక్క గుణములవల్ల కర్మ జరుగు చున్నది. కాని అహంకార మూఢుఁడు నేనే కర్తనని తలఁచును (౩-౨౭) గుణములనేమో కర్మలననేమో వీని నైజ మెఱిఁగినవాఁడు ఇంద్రియములే ఇంద్రియములు దెసఁబోవుచున్నవని యెఱిఁగి ఆసక్తుఁడు కాడు. (౩-౨౮)

(ఖ) అయిదవ అధ్యాయమున నిటులున్నది: యోగ యుక్తుఁడు కానివానికి సన్న్యాసము దుఃఖలోకములకు హేతువగును. యోగయుక్తునకు వడిగా బ్రహ్మప్రాప్తి అగును. (౬)

ఎవని చిత్తమెల్లపుడును చంచలమై అసంయతముగ నుండునో అట్టియోగహీనుడు కర్మను త్యజించినచో వాడు కష్టముల పాలగును. కోరికతీరముగాన లోపల భోగవాసన ఉండును. ఇంతకన్న కష్టము వేరేదికావలయును? కావుననే గీతాకారుఁడు యోగహీనునకు సన్న్యాసము దుఃఖకర మనెను.

పై శ్లోకముల క్రింద నీ శ్లోకములు గాంచునది—

"ఎవడు యోగయుక్తుడో విశుద్ధాత్ముడో విజితాత్ముడో జితేంద్రియుడో మఱియు ఎవని యాత్మభూతము అన్నిటికి ఆత్మయో, అతడు కర్మచేసినను లిప్తుడు కాడు. (౭) తత్త్వ మెరిగిన యోగి చూచుచు వినుచు తాకుచు ఊర్చుచు తినుచు నడచుచు నిదిరించుచు మాటాడుచు దేహ బాధలు తీర్చుచుగ్రహించుచుకనులు మూయుచుతెఱచుచు,ఇంద్రియములే వాని విషయమున ప్రవర్తించుచున్న వనియు,తానే మియు చేయుట లేదనియును గ్రహించుము. (౭-౯) చిత్తమును జయించిన దేహి మనస్సున కర్మ లన్నియు సన్న్యసించి తొమ్మిది గుమ్మములు నగరిలో[తానే కర్మయు] చేయకయు [ఒరులచే ఏ పనియు] చేయింపకయు సుఖముగా నుండును. [౧౩] ఈశ్వరుడు లోకమునకు కర్తృత్వము సృజింపలేదు. కర్మమును కర్మఫల సంయోగమును గూడ సృజింపలేదు. స్వభావమే [అనగా ప్రకృతియే]కర్మ యందు ప్రవర్తించును.

(గ) నాలుగవ అధ్యాయమున కర్మతత్త్వ మిటులు చెప్పబడెను.

కర్మయందెవడు అకర్మను మరియు అకర్మయందు కర్మను జూచునో వాడు మనుష్యులలో బుద్ధిగలవాడు, వాడు యోగి, వాడు సర్వకర్మకారి.

ఈ యంశమునకుపలుదెఱగులఅర్థములు కలవు నాకు ఇది సంగతముగా నున్నటులు తోచును..."కర్మయందకర్మను చూచుట యనగా పకృతి చేయు కర్మలో ఆత్మయొక్క నిష్క్రియత్వము కనుగొనుట. అకర్మయందు కర్మ చూచుట యనగా ఆత్మ నిష్క్రియుడయినను కర్మ జరిగిపోవు చున్నదని కనుగొనుట.

ఆత్మ అకర్త. అయినను ఈ యాత్మ యాశ్రయమున ఉండి పకృతి కార్యము చేయుచున్నదను భావము దీనికి మూలము. కావున ఒక అర్థములో ఆత్మ సర్వ కర్మకారి.

వీని పిమ్మట నాలుగు శ్లోకములు—"ఎవనికర్మలు కామ సంకల్ప వర్జితములో వానికర్మలు జ్ఞానాగ్నిచే దగ్ధములు. జ్ఞానులు అతనిని పండితుడని యందురు. (౧౯) ఎవఁడు కర్మఫలమునం దాసక్తి విడిచి యెల్లపుడు తృప్తిగని యుండునో, ఎవఁడు నిరాశ్రయుఁడో(అనగా ఎవడు దేహేంద్రియాదుల నాశ్రయించుకొనియుండునో) అతడు కర్మ చేసినను చేయనివాఁడే. (౪-౨౦) నిష్కాముఁడును నియతమగు ఆత్మయు చిత్తమును కలవాఁడును, పరిగ్రహము చేయనివాఁడును, శరీరస్థితిమాత్రప్రయోజనమగు కర్మ

మాత్రమే చేయువాఁడు కిల్బిషము పొందడు. (౨౧)తనకు దా వచ్చిన వస్తులాభముచే సంతుష్టుఁడై ద్వంద్వాతీతుఁడై మఱియు సిద్ధియెడను అసిద్ధియెడను సమానుఁడై ఎవఁడుండునో అతఁడు కర్మచేసియు బద్ధుఁడు కాఁడు. (౨౨)

(ఘ)

ఈ క్రిందిశ్లోకములు జగత్తులో సాటిలేనివి—"కర్మయందే నీకధికారము: కర్మఫలమునందెపుడును నీకధికారము లేకుండుఁగాక. నీవు కర్మఫలముకొరకు" అకర్మయందును ఆసక్తిఁగొనకుము. (౨౪౭)

కర్మఫలమునెడను కర్మత్యాగమునెడనుగూడ ఆసక్తి కూడదని యిచటఁజెప్పఁబడియె. ఏభావముచే కర్మచేయబడవలెనో ఇటుపిమ్మట కొన్నిశ్లోకములచే చెప్పబడెను.

"ఓ ధనంజయా! యోగస్థుడవై ఆసక్తివీడి సిద్ధి, అసిద్ధులయెడ సామ్యమూని కర్మలుచేయుము. సమత్వమె యోగమనఁబడును. (౨౪౮) ఫలముకోరువారు కృపణులు. (అనగా కృపా పాత్రులు) ౪౯

ఫలమును కోరినవారే కర్మబంధనమును తెంపఁగలరు

## ఉపసంహారము

"కర్మ చేయుము కాని యోగస్థుడవై; కర్మ చేయుము; ఫలము కోరనివాడవై కర్మ చేయుము; అనాసక్తుఁడవై - గీతలలో ఎటుచూచినను ఇదియే యుపదేశము జీవన్ముక్తులు ఈ విధికి పైవారు వారికి కర్మతో పనిలేదు. వారు ఇటుల ఎరుగుదురు "మేము పనిచేయము, చేయుచు లేము. ఈ కర్మ యెల్లయు ప్రకృతిది. ప్రకృతియే పనులెల్లను చేయుచున్నది." సిద్ధుఁడు కర్మయుఁ జేయఁడు. అకర్మ యందును ఆసక్తుఁడుకాఁడు.

## భక్తి తత్త్వము

భక్తి శబ్దము ముఖ్యముగా మతవిషయముననే వాడఁబడుచున్నది. అయినను ఇతరత్రాకూడా దీనిని మనము వాడుదుము. ఉదా- రాజభక్తి, పితృభక్తి-ఈ మొ. ఈ ఉదాహరణములలో సన్మానము, సేవ మొదలయిన దర్థము. ఈశ్వరభక్తికిని ఇదియే మూలార్థము. ఈశ్వరుఁడనంతశక్తిసంపన్నుఁడు. అతఁడేది తట్టిన నది చేయగలడు మానవుని సుఖదుఃఖము లతని యధీనములు. అతడొకడే కళ్యాణదాత కావున అతని యెడల శ్రద్ధగౌరవములును సన్మానము చేయుటయును మఱియు అతని ప్రీతి బడయుటకు కర్మచేయుటయు స్వాభావికము. ఈ శ్రద్ధగాని భక్తిగాని భయముతో కూడుకొన్నది. ఆదిమ మతములన్నిటి మూలమునందును భయము కానిపించును.

## ఉపాస్యుఁడు-ఉపాసకుఁడు

ఉపాస్యోపాసకులకు గల సంబంధము భక్తియొక్క స్వభావమును నియమించును. తలిదండ్రులయెడ భక్తివేరు రాజునెడగల భక్తి వేరు. రాజునెడల భక్తి ముఖ్యముగా భయమూలకము. తలిదండ్రులయెడగల భక్తితో కొంచెము భయమున్నను ప్రధానముగా ప్రీతి మూలము' ఇక ఎవడు చెలికాడో, ఎవడు సుహృత్తో, ఎవడు ప్రాణములకు ప్రాణమో, అట్టివానియెడల భక్తి శుద్ధప్రీతి.

## గీతలో ఈశ్వరుఁడు

గీతలలో ఈశ్వరుడు పలుఁదెఱఁగుల వర్ణింపఁబడియున్నాడు. ఒకదెస అతఁడు రుద్రుడు. (౧౧-౨౩,౩౦) సంహర్త (౮-౧౮; ౧౧-౩౨;౧౩-౧౬) ప్రభువు (౧౧-౪)

[డా. జంధ్యాల మహతీ శంకర్ సేకరించి ఇచ్చిన రచన]

(ఇంతవరకే లభించినది)



# కలగూరగంప

## తెలుగులోని ప్రతిధ్వని పదములు

### "త్రి"

అర్థపుష్టికి ఒక పదము రెండుసార్లు పలుకబడును. కర్ణుడు శల్యుని "పోవ పోవ." (కర్ణప. ఆ2, ప 8) అని గదమాయించును. నిద్రపోవు దేవుని, భక్తుడు "ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద" అని లేపును. ఉపనిషత్తు "చరైవేతి చరైవేతి" అనును. రవీంద్రుడు "ఏకల ఛలో ఏకల ఛలో" అని ప్రోత్సహించును. "మొలక చీకటి జలజల రాల్చు"ను రామకృష్ణుడు.

పదము మరల మరల వచ్చుట రకరకాలుగానుండును.

1. దాదాపు సమానార్థకములైన పదములు రెండుసార్లు వచ్చుట.

ఉదాహరణములు : నీ నిత్తిజాయితి, డబ్బు దస్కం, బంకుగొంకు, పిల్లాపాప.

2. ఒకే పదము రెండుసార్లు పలుకబడుట.

ఉదాహరణములు : కిచ కిచ, మినుకు మినుకు, రివ్వు రివ్వు

3. ఒక పదము అచ్చు, హల్లు, గుణింతపుభేదాలతో రెండుసార్లు పలుకబడుట.

ఉదాహరణములు: ఉక్కిరి బిక్కిరి, కీచరబాచర, కచాకచి (2),(3) విభాగములలోని పదములు సమాన శాబ్దికములు.

(1) వ విభాగములోని పదము ను "రిడూప్లికేషన్" పదములు (ఆమ్రేడిత పదములు) అంతురు.

(2) వ విభాగములోనిపదములను "ఎకో" పదములు (ప్రతిధ్వని పదములు)అందురు.

(3)వ విభాగములోని పదములను శ్రీ పేరి భాస్కరరావుగారు[1] "పాక్షికామ్రేడిత పదములనియు" కావున ప్రతిధ్వని పదములనియు అన్నారు. నేను వీనిని పాక్షిక ప్రతిధ్వని పదము" అందును. ఒకే పదము రెండుసార్లు వచ్చినప్పుడే పరిపూర్ణప్రతిధ్వనిత్వము సిద్ధించును. ఈ పరిపూర్ణ ప్రతిధ్వని పదములను శ్రీ పేరివారు "ఒనొమటోపిక్" పదముల క్రింద చేర్చిరి. ఇట్టి వానిని ధ్వన్యను కరణ శబ్దములనవచ్చును. "శబ్దార్థసామ్య" పదములనియు అనవచ్చును. ఇట్లనిన ఏమో కొన్ని దృష్టాంతముల నిచ్చెదను.

కా అని అరచునది కాకి

కిణకిణమ్రోగునది కింకిణి

ఇందు వస్తువుచేయు ధ్వనియే వస్తునామమైనది కావున కాకి, కింకిణి అనుపదములు "ఒనమొటోపిక్" (శబ్దార సామ్య) పదములు.

గోళాకారముగనుండు పెద్దరాతిని "బేబాయి" అనుట కంటె "గుండు" అనిననే బాగుండును. గుండు శబ్దార్థసామ్య పదము. దూరమును "దూర" మనిననే బాగుండును. "దగ్గర" అనిన బాగుండదు. తలక్రిందు కామా గుర్తులు పదముయొక్క శబ్దమును సూచించుటకు వేయబడినవి. "జిగట", "క్రొక్కెను." వంటి పదములలో శబ్దార్థ సామ్యత ఉన్నది. ఎఱుక, తెలివి, సత్యములు అట్టి పదములుకావు.

క్రియలను అనుకరించు ధ్వనులు శబ్దార్థసామ్యములు

బుడుంగున మునింగెను

జలజలరాలెను

హాచ్ అని తుమ్మెను

జలజల వంటి పదములు ధ్వన్యనుకరణములేకాక ప్రతిధ్వని పదములుకూడ అగును.

ఒక పదము ఒకసారి పలికినప్పుడు అర్థమీయక రెండుసారులనినప్పుడు నిర్దిష్టార్థము వచ్చినట్లయిన, ఆ పద ద్వయమును ప్రతి ధ్వని పదము పిలువవచ్చును.

పై నిర్వచనమును ప్రాతిపదికగ చేసికొని, పరిపూర్ణ ప్రతిధ్వని పదముల పట్టికను, పాక్షిక ప్రతిధ్వని పదముల పట్టికను నిర్మించినాను. శబ్దరత్నాకరము[2], బ్రౌణ్యము[3] లోకవ్యవహారము ఆధారముగ పదములను ఏర్చికూర్చి అకారాదిగ అమర్చినాను.

పట్టిక 1 - పరిపూర్ణ ప్రతిధ్వని పదములు

పట్టిక 2 - పాక్షిక ప్రతిధ్వని పదములు
పట్టిక 3 - ఇంగ్లీషులో పాక్షిక ప్రతిధ్వని పదములు.

# పట్టిక 1

తెలుగులోని పరిపూర్ణ ప్రతిధ్వని పదములు

## క

కచకచ
కటకట*
కనకన*
కపకప
కరకర
కఱకఱ
కలకల*
కళకళ*
కవకవ
కసకస*
కహకహ*
కికకిక★
కిచకిచ
కిటకిట★
కిణకిణ
కితకిత
కిరకిర★
కిలకిల★
కివకివ
కిసకిస
కుతకుత★
కురకుర
కురుకురు
కుపకుప
కుహికుహి
కుహూకుహూ
కొరకొర
కొలకొల

## గ

గజగజ★
గటగట*
గడగడ★
గణగణ★
గనగన
గపగప
గబుకు గబుకు
గమగమ
గరగర★
గఱగఱ
గలగల★
గళగళ
గిజగిజ★
గిటగిట
గిరగిర★
గిలగిల★
గిలిగిలి
గుజగుజ
గుటగుట★
గుటుకుగుటుకు
గుడిగుడి
గుడుగుడు
గుదగుద*
గునగున*
గుబగుబ*
గుబులు గుబులు
గుమగుమ
గురగుర*
గులగుల*
గుసగుస
గుసుగుసు★
గొటగొట
గొణగొణ
గొదగొద
గొరగొర★
గొలగొల
గోలుగోలు

## ఘ

ఘుమఘుమ★

## చ

చకచక★
చరచర★
చలచల
చికిచికి
చిటచిట
చితచిత★
చిదచిద
చిమచిమ★
చిఱచిఱ
చిఱ్ఱచిఱ్ఱ
చిలచిల
చివచివ★
చుటచుట
చురచుర★
చెంగుచెంగు
చెరచెర★
చెఱచెఱ
చొటచొట
చొడచొడ
చొఱచొఱ

## జ

జరజర★
జలజల*
జవజవ
జాదుర జాదుర
జిగజిగ*
జిబిజిబి
జివ్వుజివ్వు
జొటజొట

## ట

టకటక*
టణటణ
టపటప
టింగుటింగు
టిక్కుటిక్కు
టివ్వుటివ్వు

## ఠ

ఠవఠవ

## డ

డబడబ
డులడుల

## త

తకతక
తటతట
తపతప*
తరతర
తలతల
తళతళ*
తళుకుతళుకు
తవతవ*
తహతహ*
తుకతుక
తుటతుట
తుటుకుతుటుకు
తెకతెక
తెపతెప
తెయితెయి
తెరతెర
తెలతెల
తొకతొక
తొటతొట
తొరితొరి

## ద

దగదగ*
దడదడ
దబదబ
దిగదిగ
దిమిదిమి
దిరదిర
దుడిదుడి
దుమదుమ★

దురదుర
దుబదుబ
దొడదొడ
దొనదొన
దొప్పదొప్ప
దొమదొమ

న

నకనక★
నమనమ
నవనవ
నసనస
నిగనిగ
నిటనిట
నుసనుస★
నురనుర★
నెళినెళి

ప

పకపక★
పటపట★
పదపద
పదేపదే
పరపర★
పరిపరి
పలపల
పసపస
పొటపొట
పికపిక
పిటపిట★
పితపిత★
పిదపిద
పిలపిల
పిసపిస★
పీచుపీచు★
పుటపుట
పుతపుత
పురపుర★
పులుకుపులుకు
పులిపులి
పెటపెట
పెళపెళ★
పొటపొట
పొటిపొటి
పొనపొన

పొలపొల

బ

బగబగ
బడబడ★
బరబర★
బలబల
బళుకుబళుకు
బిక్కుబిక్కు
బిరబిర★
బిలబిల
బిలిబిలి★
బిసబిస
బిసిబిసి
బుగబుగ
బుగులుబుగులు
బుడబుడ★
బుడిబుడి
బురబుర★
బుసబుస★
బెకబెక★
బొటబొట
బొడబొడ★
బొళబొళ★
బొళుకుబొళుకు
బొరుబొరు

మ

మటమట
మదిమది
మరమర
మటిమటి
మలమల★
మిటమిట
మినమిన
మినుకుమినుకు
మిలమిల★
మిసమిస
ముదముద
మునమున
మురముర
ముసిముసి
మెకమెక
మెరమెర

మొరమొర

ర

రవరవ
రువరువ
రివరివ★
రివ్వురివ్వు
రుసరుస★
రెకరెక
రెపరెప★

ల

లబలబ★
లవలవ
లివలివ
లుకలుక
లొటలొట★
లొడలొడ★

వ

వకవక

వటవట
వడవడ
వలవల★
వళవళ
వికవిక★
విరవిర★
విలవిల★
విసవిస★
వెడవెడ
వెఱవెఱ
వెలవెల

స

సదసద
సరసర★
సలసల★
సిలసిల
సురసుర
సొటసొట

[నక్షత్రపు గుర్తుగల పదములు శ్రీ పేరి భాస్కరరావుగారి "ఒనొమటొపిక్" పదములపట్టికలో నున్నట్టివి]

## పట్టిక –2

### తెలుగులోని పాక్షిక ప్రతిధ్వనిపదములు

అ

అంకపొంక
అంకవంక
అంజలిగుంజలి
అండదండ
అకటవికట
అకలాసకలా
అటమట
అడపదడప
అడపొడ
అడవతడవ
అడ్డదిడ్డ
అడ్డదుడ్డి

అదనబదన
అదలబదల
అదవద
అనలుకొనలు
అన్నెముపున్నెము
అమితుమి
అరమర
అరవర
అఱగొర
అఱమర
అఱవఱ
అటిముటి
అలబల
అల్లిబిల్లి

అవకతవక
అస్తవ్యస్త

## ఆ

ఆజుబాజు
ఆదరాబాదరా★
ఆలనపాలన★
ఆషామాషి

## ఇ

ఇంచిమించి
ఇంచుమించు
ఇరుగుపొరుగు★

## ఈ

ఈడుజోడు
ఈరతార

## ఎ

ఎకాఎకి
ఎక్కెసక్కె(ము)
ఎగాదిగా
ఎడనెడ
ఎద్దుమొద్దు

## ఏ

ఏటుపోటు
ఏడాగోడ(ము)
ఏతాముగోతాము
ఏదారిగోదారి

## ఒ

ఒకానొక

## ఓ

ఓహరిసాహరి

## క

కంచుమించు
కకపిక
కకవిక
కక్కిరిబిక్కిరి
కచాకచి
కటాకటి
కట్టుమట్టు
కన్నీరుమున్నీరు
కరకరి
కలకరి
కలకటి
కలగాపులగ(ము)
కళపెళ*
కళవళ
కసపిస
కసబిస
కసమస
కసిమిసి
కాదారిమాదారి
కిక్కిరిబిక్కిరి
కీచరబాచర
కూలినాలి★
కేళకూళి
కొకిబికి
కొక్కిరిబిక్కిరి

## ఖ

ఖంగుఖంగు

## గ

గజిబిజి
గడబడ
గడిబిడి
గరగార
గలిబిలి
గసగుసి
గసిబిసి
గాసటబీసట
గ్రుక్కుమ్రిక్కు

## చ

చిందరవందర
చికపిక
చికమక
చిటపొట
చిటిపొటి
చిటుకుపొటుకు
చిడిముడి
చిదగొద
చిన్నారిపొన్నారి
చిరమర
చిఱుముఱు
చిల్లరమల్లర★
చిలివిలి
చీకిరిబాకిరి
చికిలిమాకిలి
చీటికిమాటికి
చెకపిక
చేదోడువాదోడు.

## జ

జంకుగొంకు★

## త

తకపిక
తగ్గుమొగ్గు
తటపట
తటమట
తటవట
తట్టబుట్ట★
తడిపొడి
తళుకుబెళుకు ★
తాడుపేడు★
తారుమారు
తికమక
తిక్కటమక్కట

## ద

దడబడ
దుడుదుడ

## న

నజుగుజు(లు)

## ప

పిల్లజెల్ల★
పుటనట★
పేదసాద

## బ

బరాబరి
బాహాబాహి
బొటాబొటి

## మ

మడితడి
ముష్టాముష్టి

## ర

రమారమి
రంకుబొంకు

## ల

లబొదిబొ★
లూలామాల(ము)
లేకిబోకి

## వ

వళావళి
వికావిక
విటతట
విడిముడి
వితావిత
వీటతాట(ము)
వెట్టిమొట్టి

## స

సందుగొందు
సగ్గిసముగ్గిస
సతమత
సదమద
సిగ్గుఎగ్గు★

## హ

హళాహళి
హుటాహుటి
హోరాహోరి

[నక్షత్రపు గుర్తు గలపదములు శ్రీ పేరి భాస్కరరావుగారి సమానార్థకామ్రేడిత పదముల పట్టికలో నున్నట్టివి]

## పట్టిక 3

ఇంగ్లీషులోని కొన్ని పాక్షిక ప్రతిధ్వని పదములు

హెల్టర్ స్కెల్టర్
హిదర్ తిదర్
హాబ్సన్ జాబ్సన్
హాబ్ నాబ్
హోకస్ పోకస్
హాడ్జ్‌పాడ్జ్
ఫ్లొట్సం జెట్సం
టీడిల్‌డం ట్వీడిల్‌డీ
పెల్ మెల్
రిఫ్ రాఫ్
విల్లీ నిల్లీ
చిట్ చాట్
డిల్లీ డాలీ
మంబో జంబో

### పట్టికల పరిశీలన

### పట్టిక-1 పరిపూర్ణ ప్రతిధ్వని పదములు

పట్టికలో 244 ప్రతిధ్వనిపదములు కలవు. ఇందులో శ్రీ పేరిభాస్కరరావుగారి గ్రంథమున ధ్వన్యనుకరణ పదపట్టికలో ఈయబడిన 86 పదములును (నక్షత్రగుర్తు గలవి) కలవు. ఇవి ధ్వన్యనుకరణములేకాక ప్రతిధ్వనులుకూడ. పాక్షికామ్రేడితము (పార్షియల్ రిడూప్లికేషన్) ప్రతిధ్వనికి దారితీయునని శ్రీ పేరివారన్నారు. ఇల్లు గిల్లు, కూర గీర, పులి గిలి, పుట్ర నట్ర మొదలైనవి ప్రతిధ్వనిపదములన్నారు. పట్టిక 2లో వారిచ్చినవే (నక్షత్రము గుర్తువి) అయిన ఈడుజోడు, కూలినాలి, చిన్నారి పొన్నారి, జంకు గొంకు, తళుకుబెళుకు, రంకుబొంకు, సందుగొందు వంటివి పరిశీలించిన, దాదాపు సమానార్థక సమాన శాబ్దికములైన రెండు స్వతంత్ర పదములు కలిసినట్లుస్పష్టమగును. ఇవి పూర్తిగా ఆమ్రేడితములు (డబ్బు దస్కంలో వలె) కావు. ప్రతిధ్వనులునుగావు (కిచకిచలోవలె) ప్రతిధ్వని పదముగా చెలామణి యగుటకు ఒకే పదము రెండుసార్లు రావలెను. ప్రతిధ్వని పదములలోని రెండు భాగములు విడదీయరానివిగా ఉండవలెను-జయవిజయులు. అశ్వినీదేవతలు, సనకసనందులు, లవకుశులు, కరటకదమనకులు లారెల్‌హార్డీలు, సయాంకవలలవలె పదమును ఒకసారి ఉచ్చరించినప్పుడర్థమీయక, రెండవసారి యన్నప్పుడే నిర్దిష్టార్థము వచ్చిన, ఆ పదముల జంటను ప్రతిధ్వని పదమనవచ్చును. ఆపక్షి "కిచ" మనెను అనిన అర్థమురాదు. ఆ పక్షి "కిచకిచ" మనెను అనిన అర్థము వచ్చును. ఈ నియమము ప్రకారము చెంగుచెంగు, టివ్వుటివ్వు, టింగుటింగు, రివ్వురివ్వు, జివ్వజివ్వు, బిక్కుబిక్కులు ప్రతిధ్వని పదములు కాజాలవు. ఇటువంటి పదములలో రెండు విశేషములున్నవి. ఒకే పదములో నిర్దిష్టార్థముండుట. మొదటి పదము మొదటి యక్షరము గురువగుట చెంగున, టివ్వుమని, టింగని, రివ్వున, జివ్వున, బిక్కుమనుచులలో కూడా అర్థమున్నది. ప్రతిధ్వని పదములలో దీర్ఘములుండవు. కీచుకీచు, బోరుబోరు, గోలుగోలు, వంటి వానిలో ప్రతిధ్వనిత్వమున్నను, ఒక్కపదమే అర్థమీయగలదు. ఉదా: కీచుమని, బోరున, గోలున. ప్రతిధ్వని పదము రెండక్షరము కల్గియుండును. దీనికి గుటుకు గుటుక్కు, మినుకుమినుకు, తళుకుతళుకు, గుబులుగుబులు గుబురుగుబురు, బుగులుబుగులు, బొళుకుబొళుకులు వికల్పములు వీనిలో ఒక్కపదమే అర్థమీయగలదు. ఈ నియమము లన్నిటికీ "జామరజాదుర" మినహాయింపు. ఇది శ్రీనాథ ప్రయోగము. ఆయన అసాధ్యుడుకదా! ప్రతిధ్వని పదములలో అచ్చులుండవు. మొదటి పదము రెండవహల్లుకు, రెండవ పదము మొదటి అచ్చుకు కావలసిన సంధి, ద్రుతాగమము, యడాగమము ప్రతిధ్వని భంజకమగును. అబ్బఅబ్బ (అబ్బబ్బ) అయ్యో అయ్యో [అయ్యోయ్యో], ఔర ఔర [ఔరౌర] ఉదాహరణములు. అందుకే ఎడ ఎడ [ఎడనెడ] ఒకా ఒక [ఒకానొక]అను పాక్షికప్రతిధ్వని పదములలోచేర్చినాను. [పట్టిక2]. ప్రతిధ్వనిపదములపాత్రఏమి? విశేషణములు [బిసిబిసిపలుకులు] గాను, క్రియకుముందు ధ్వన్యను కరణములు [జలజలరాలు] గాను, విశేష్యములు [రవరవ] గానూ ఉండుట వానిపని.

పట్టిక 1 లో 214 ప్రతిధ్వనిపదములుండుట చూడదగును. నేను 20,00 వరకు దేశ్యతెలుగు పదములను సమీక్షించియుందును. అనగా తెలుగులో 1.2 శాతము పరిపూర్ణ ప్రతిధ్వనిపదములున్నవన్నమాట. పాక్షికప్రతిధ్వని పదములను 145 ను కూడ కలుపుకొనిన దాదాపు 2 శాతమగును. ఈసంఖ్య అంతతక్కువేమీకాదు. ఇంగ్లీషుభాషలో 5 లక్షలపదములు నిఘంటువుకెక్కినవట! అయినను పరిపూర్ణ ప్రతిధ్వనిపదములు అంతగ వినబడవు. "పూపూ" పదమున్నది. ఇది క్రియాపదము. పాక్షికప్రతిధ్వనిపదములు కలవు. కొన్నింటిని పట్టిక 3 లో చూడవచ్చును. సంస్కృతభాషలోను ప్రతిధ్వనిపదములు వినబడవు. "ధగధగా" యమాన "కిలకిలారావ" ధాళధళ్య" "ఛటచ్ఛట" వంటివివానిని ప్రయోగించిన కవి యొక్క దేశభాషనుండి దిగుమతియై సంస్కృతీకరింపబడి యుండునని నా యనుమానము. ప్రౌఢ్యము "నిగనిగ" ను తెలుగుపదముగాను "నైగనైగ్యము" సంస్కృతపదముగాను పేర్కొన్నది!

అక్షరముల పైకి "గ" లో ఎక్కువపదములున్నవి. పదములసంఖ్య 37. "క"లో 28 పదములు కలవు. "ప" లో 27 కలవు. అతిస్వల్పపదములు "ఘ"లోను"ర"లోనుగలవు. ఒక్కొక్కపదము "ద"లో 2 పదములుకలవు. య,ఖ,ఛ,ఠ,ఢ ధ,ఫ,భ,శ,ష లతో ప్రారంభించుపదములు దేశ్య తెలుగులో లేకుండుటచేత, ఈ యక్షరములలో ప్రతిధ్వనిపదములులేవు. రవరవ అనుపదము టవటవ కావచ్చును. "హ" స్థానము సందేహాస్పదము. కన్నడభాషలో "హ" ఎక్కువ. ఆమాటలు తెలుగులో 'అ' యని అయినను "ప" యని అయినను మారును.

పట్టిక-2

పాక్షిక ప్రతిధ్వని పదములు

రెండవపట్టికలో 145 పదములున్నవి. ఇందు శ్రీ పేరి భాస్కరరావుగారు "రిడూప్లికేటెడ్ కాంపౌండు"అని ఇచ్చిన 22 వరకు పదములు (నక్షత్రముగుర్తుగలవి)కలవు. పట్టికలో కొన్ని అచ్చు, హల్లు, గుణింతపు భేధములతోడి ప్రతిధ్వనిపదములే. ఉదాహరణములు అల్లి బిల్లి. ఇంచు మించు, ఓహరి సాహరి, కసబిస, కక్కిరిబిక్కిరి, గాసటబీసట, తికమక,సగ్గిస ముగ్గిస: హుటాహుటి. ఈపదములజంటలో ఏ యొక్కపదమున కర్థములేదు. కానీ రెండుశబ్దములనినప్పుడు నిర్దిష్టార్థము సిద్ధించును . ఇప్పుడీపదములను గమనింపుడు. అలన పాలన, ఈడుజోడు, చిన్నారిపొన్నారి, జంకుగొంకు, తట్ట బుట్ట. తళుకుబెళుకు, మడితడి, రంకుబొంకు, సందుగొందు, సిగ్గుఎగ్గు, ఈపదములు శ్రీపేరివారివి. దాదాపు సమానార్థక సమానశాబ్దికములైన రెండు స్వతంత్రపదముల కూటికలివి. పాక్షిక ప్రతిధ్వని పదములలో మూడక్షరములు, దీర్ఘములు గురువులు యధేచ్ఛగావచ్చును. అన్ని అక్షరముల పైకి "అ"లో ఎక్కువపదములు-28-కలవు. "క"లో 25 కలవు. ఒ,ఓ,ఖ,జ,న లలోచెరి ఒకేపదమున్నది. అచ్చులలో మొదటి 'అ'లోను హల్లులలో మొదటి'క'లోను ఎక్కువగా పదములున్నవి. అచ్చులలోకూడ పదములుండుటకుకారణము అచ్చు,హల్లు,గుణింతము విషయములో స్వాతంత్ర్యముండుటయే. ఈసౌకర్యము పరిపూర్ణప్రతిధ్వనిపదనిర్మాణములో లేదు.

తెలుగులో పరిపూర్ణప్రతిధ్వనిపదముల సంఖ్యకంటె

పాక్షిక ప్రతిధ్వనిపదముల సంఖ్యతక్కువ. ఇంగ్లీషుభాషలో పరిస్థితి దీనికి విరుద్ధము. పట్టిక 3 లో ఇంగ్లీషులోని పాక్షిక ప్రతిధ్వనిపదములను చూడవచ్చును. సంస్కృతవాసనకల "అస్తవ్యస్త" హిందీవారు వాడుచుందురు.

ప్రతిధ్వనిపదములలో "ఱ" కలవి చాలాయున్నవి. ఈయక్షర ఉచ్చారణ, లేఖనము అడుగంటుచున్న ఆధునిక కాలములో, ఇదికల ప్రతిధ్వనిపదములు రూపుమాసిపోవును. శకటరేఫమును వదలుకొనుట సంస్కృతభాష పెత్తనమును పారుపత్తెమును ఒప్పుకొనుటయే. అరవభాషలో విశిష్టోచ్ఛారణకల "ళ"అను అక్షరమునువారు విడనాడలేదు. భాష వృద్ధిజెందునది ఎన్నిశబ్దములు సాధ్యమయిన అన్నిశబ్దములు స్వీకరించుటవలననే.ఇంగ్లీషుభాషలో లక్షలాదిపదము లుండుటకు కారణముఏమి?

ధ్వన్యనుకరణ శబ్దములు భాషకు సంగీతమిచ్చును. జీవముపోయును. "డబ్బుడుబ్బు ఖంగుఖింగు ఠంగుఠింగు మన్ధ్వనుల్"లో సూరన శబ్దచిత్రము గీచినాడు. గునగున నడచుగుండ్రాయి ఎంతముచ్చట గొల్పును!

తెలుగులో ధ్వన్యనుకరణపదముల, ప్రతిధ్వని పదముల విస్తృతి, ఆభాషకు కర్ణపేయత్వమును, స్రోతోగుణమును నిచ్చుచున్నవి.

## సూచికలు


1. పేరి భాస్కరరావు: రీడూప్లికేషన్ ఎండ్ ఒనొమటొపోయా ఇన్ తెలుగు (1977): పబ్లిష్డ్ బయి డా. ఎ. ఎమ్ ఘటగె ఎట్ డెక్కన్ కాలేజి, పూణె. ప్రింటెడ్ బయి ఎమ్. ఎస్. లట్కర్ ఎట్ శ్రీసరస్వతీ ముద్రణాలయ, ప్లాట్ నెం.76 "ఇ" బ్లాక్, భోసారీ, పూణె.

2. శబ్దరత్నాకరము, 1937.

3 డిక్షనరీ తెలుగు-ఇంగ్లీష్, 2 వ ప్రతి, 1979, ఛార్లెస్ ఫిలిఫ్ బ్రవున్, ఏషియన్ ఎడ్యుకేషనల్ సర్వీస్, న్యూఢిల్లీ.


శ్రీసర్దేశాయి తిరుమలరావు



# గ్రంథ విమర్శలు

## రామాయణం

రచన: శ్రీ నాయని-కృష్ణమూర్తి, క్రౌనుసైజు 336 పేజీలు. వెల రు. 15లు. ప్రకాశకులు - విజయవాణి పబ్లిషర్సు, చౌడేపల్లి, పిన్. 517257 చిత్తూరు జిల్లా.

రామాయణకథ చాలాపాతదే ! అయినా రామాయణ కథాకాలక్షేపాలు దేశమంతటా చాలా చోట్ల జరుగుతూనే ఉంటాయి. ఇది పాత కథ గదా అని అనుకోకుండా జనం వాటికి హాజరు అవుతూనే ఉంటారు. కొన్నిచోట్ల శ్రోతలు పలుచగా ఉండి, కాలక్షేపం చేసేవారికి "ఇంకా జనం చేరితే బాగుండును" అనిపిస్తుంది. కొన్ని చోట్ల ప్రజలు కిటకిట లాడుతూ నిలబడడానికయినా చోటుండదు. ప్రవచనం చేసే వారి శక్తిసామర్థ్యాలనుబట్టీ, కథాకథనంలోని తీరునుబట్టీ శ్రోతల సంఖ్య వుంటుంది. కథ పాతదే అయినా వారి చేతుల్లో అది కొత్తదనాన్ని పుంజుకుంటుంది. రచనా పద్ధతి కూడా అలాంటిదే !

ప్రాచీన కాలం నుంచీ రామాయణ రచనలు సాగుతూనే ఉన్నాయి. వచన వాఙ్మయం వెలువడని తొలిరోజుల్లో పద్య రూపంగాను, ద్విపదలతోనూ ఆ కథలు వచ్చాయి. వాటన్నిటిలోనూ భాస్కర రామాయణం, రంగనాథ రామాయణం ఎక్కువ ప్రచారంలోకి వచ్చాయి. ఈ శతాబ్దంలో వెలువడిన పద్య రామాయణాలలో విశ్వనాథ వారి రామాయణ కల్పవృక్షం మంచి పేరు తెచ్చుకున్నది. పద్యాలకంటే వచనాలే కొంతప్రచారాన్ని పొందాయి. అందులోనూ-వ్యావహారిక భాషలో వచ్చినవే ఎక్కువగా జనామోదాన్ని పొందుతున్నాయి. జనసామాన్యానికి గ్రాంథిక భాషకంటె వ్యావహారికమే సులభంగా అర్థం కావడం దీనికి ముఖ్య కారణం.

కాలం మారింది. ఈ నవయుగంలో ఛందోనియమాలక్కర లేని వచన పద్యాలకూ, కథలకూ, నవలలకూ ప్రాముఖ్యం హెచ్చింది. ఏ విషయాన్ని చెప్పినా కథా రూపంగానూ, నవల మాదిరిగానూ చెప్తే అందరూ వింటారు. అందువల్లనే పురాణ కథలు కూడా ఆ పద్ధతి లోనే వస్తున్నాయి. తమిళంలో రాజాజీ రచనలు వచ్చినట్టు తెలుగులోనూ భారత భాగవత రామాయణాలు వ్యావహారిక భాషలోనూ వస్తున్నాయి. అట్టి రచనలలో నాయని కృష్ణమూర్తిగారి యీ రామాయణం ఒకటి.

రచయిత వ్యావహారిక వచనరచనలో చెయ్యి తిరిగిన వారివలే తోస్తున్నది ఇందులో రామకథ ఉత్తర రామాయణంతో సహా అవతార పరిసమాప్తివరకూ చెప్పబడింది. దీని రచనలో అయన కొత్తపద్ధతిని అనుసరించారు. క్రౌంచ మిథునంలోని ఒకదాని హత్యవల్ల వాల్మీకి మహర్షికి కలిగిన కరుణతోగాని, దశరథుని వృత్తాంతంతో కాని కథ ప్రారంభం కాలేదు. నవలను ప్రారంభించినట్లు- నారదమహర్షి శ్రీ మహావిష్ణువునకు ఇచ్చిన శాప వృత్తాంతంతో - చక్కని పద్ధతిలో కథ ప్రారంభమయింది. ఆ తర్వాత వేదవతివృత్తాంతం, పిదప దశరథుని పుత్రకామేష్టి – ఈ విధంగా కథ అనురూప పద్ధతిని సరళంగా సాగిపోయింది. చదవడం ప్రారంభిస్తే చివరివరకూచదవాలనే ఆసక్తి కలుగుతుంది. పెద్దలేకాకుండా పిన్నలు కూడా చదివి అర్థం చేసుకొనుటకు అనుకూలంగా సాగింది రచన.

రచయిత రామకథకు సంబంధించిన పెక్కు గ్రంథాల నుండి కథను సంగ్రహించి, తన కవితా చమత్కృతిని జోడిస్తూ దీనిని రచించారు. సీతాదేవి రాముని వరించి మెడలో పూలమాలను వేసిన తర్వాత,అతనికి నమస్కరించాలని చెలికత్తెలు, తండ్రి చెప్పారట ! ఆమె నమస్కరించలేదు. కారణం ? ఆయన పై గౌరవం లేక కాదు. అతని పాదస్పర్శచే రాయి స్త్రీగా మారింది కదా! తన కిరీటమందలి మణులు అతని పాదాన్ని తాకితే - ఎందరో యువతులు తయారయి ఆమెకు అతనివద్ద ప్రవేశం లేకుండా చేస్తారేమో ! అని ఆమె భయమట ! గుహుడు రాముని కాళ్లు

కడగడాన్ని ఉపేక్షించి కవులు ఈ సంఘటను వర్ణించడం ఉన్నది. ఈ రచయిత దానిని సీతాదేవి విషయంలోనే చమత్కారంగా ఉపయోగించారు. చాలా చోట్ల ఇలాంటి చమత్కృతులు కానవస్తాయి.

చక్కని వచనంలో ఇంపుగా సాగిన యీ రచన రామాయణ కథను చదవ గోరిన అందరికి ఆనందాన్ని కలిగించ గలదని నా ఆశయం

— శ్రీబులుసు వేంకటరమణయ్య

## 'గాంధీ మార్గం'

(హింసకు ప్రతిచర్య హింస కాదు)

రచన: కోగంటి రాధాకృష్ణమూర్తి పబ్లిషర్స్: ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రైవేట్) లిమిటెడ్ డిస్ట్రిబ్యూటర్స్: సరళా పబ్లికేషన్స్, తెనాలి. వెల: పన్నెండు రూపాయలు. పుటలు: 160.

విశ్వజనీయతే తన విశిష్టతగా, మొత్తం మానవ ప్రపంచ సంస్కృతి, సాహిత్యాలు తన వారసత్వంగా, తెలుగు దేశమే కాక తెలుగు భాష విస్తరించిన ప్రాంతమంతా తన కార్య క్షేత్రంగా, ప్రపంచంలో విప్లవాలు ఎక్కడ వచ్చినా, ఏ కాలమందు జరిగినా, 1609 ఇంగ్లాండ్ విప్లవం, 1776 అమెరికా విప్లవం, 1789 ప్రెంచి విప్లవం, 1917 రష్యా విప్లవం, 1947 భారత స్వాతంత్ర్యం, 1949 చైనా విప్లవం - "ఈ చరిత్రాత్మక సంఘటనలన్నిటినీ లోతుగా, సునిశితంగా, సమ్యక్ దృష్టితో పరిశీలించి తదనుగుణమైన ప్రచురణలు చేయాలని" ఆవిర్భవించిన సంస్థ ప్రజాస్వామ్య ప్రచురణలు, ఇది నిజంగా వినూత్న యత్నమే, దాని దళమ పుష్పమే ఈ గ్రంథం.

విషయాలు చెప్పటం చాలా సులభం, ఆచరించి చూపటం చాలా కష్టం. చెప్పే వాటిని ఆచరించి చూపాలని తాపత్రయ పడే కొద్దిమందిలో శ్రీ ఎం. వి. రామమూర్తి, వెంకట సుబ్బమ్మ దంపతులు ప్రముఖులు. ఈ ప్రచురణ సంస్థ ఆరుగురు సభ్యులలో శ్రీ రామమూర్తి అధ్యక్షులు, వెంకట సుబ్బమ్మ, కోగంటి రాధాకృష్ణమూర్తిగారలు ఇరువురు సభ్యులు. గాంధీజీ కర్మమయ, ఆదర్శమయ, వివాదాస్పదమయు, ఉత్సాహమయి జీవితాన్ని విహంగావలోకన దృష్టితో వీక్షించింది కోగంటి వారి కలం. 14 ప్రకరణాలలో, సంఘటనలకన్నా సంఘటనలకు దారితీసిన ఆలోచనా ధోరణికి ప్రాధాన్యమిస్తూ, ఆలోచనల చుట్టూ అల్లబడిన దీ పుస్తకం.

తెనాలి తాలూకా కూచిపూడి గ్రామంలో జన్మించిన శ్రీ కోగంటి, చిన్నపుడు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి ఆధ్వర్యంలో నడిచి, మాదిగపల్లెలో నీరుత్రాగి, స్వకుటుంబం చేత బహిష్కరింపబడి, క్రమేణా యమ్. యన్. రాయ్ ప్రభావానికి లోనై నేడు హ్యూమనిస్టుగా జీవితాన్ని సాగిస్తున్నారు.

అధ్యయనం చేసిన తరువాత "గాంధీ మహాభారత యుద్ధంలో అశేషసేనా వాహినిని బద్దలుచేసి ద్రోణుడు పన్నిన అనుహ్యామైన పద్మవ్యూహంలో ప్రవేశించగల వీర అభిమన్యునిగా ప్రతిబింబించాడు. స్వాతంత్ర్య సమరానికి సాధారణ ప్రజలను సమీకరించి సర్వహంగులూ కలిగి యున్న బ్రిటిష్ సామ్రాజ్యాన్ని ఎదిరించటానికి సన్నద్ధుడయిన మహానాయకునిగా శోభించాడు"....

"కొన్నిట ముఖ్యంగా గాంధీ చివరి రెండు సంవత్సరాల కృషి అమోఘము, అద్వితీయము. గాంధీ మరణ వార్తకు కూడా చలించని రష్యనులు తరువాత క్రమేపి తమ అభిప్రాయాలను మార్చుకోసాగారు......" తన వ్యక్తిగత జీవితం, ఆధ్యాత్మిక చింతనతో అతి సామాన్యులయిన ప్రజానీకాన్ని సమీకరించి తన వెంట నడిచిన సాధారణ మానవులను సాహసవంతులను చేసి ప్రాణ త్యాగానికి కూడా సిద్ధపడిన వీరులుగ సృష్టించ గలిగాడు. ఇది భారత దేశానికి బాపూజీ చూపిన నూతన ఆదర్శమార్గం మంచురాని ఘట్టం."

చివరి రెండు ప్రకరణాలు "పర్యాలోచన" ఎరిక్‌ఫ్రాం రచన ఆధారంగా వ్రాసిన "ఆరాధన" అమూల్యాలు.

"గాంధియన్ సోషలిజం" ఆదర్శంతో తానావిర్భవించానని చెప్పుకొనే రాజకీయపక్షమే ఉందినాడు దేశంలో.

చక్కని ముఖ చిత్రంలో, ప్రతి ఆలోచనా పరుడూ అవశ్యం చదవ తగిన దీ గ్రంథం.

—శ్రీ కాకుమాను తారానాథ్.



Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 61247.

80



**మనము ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA104M171 |
| పుస్తకం పేరు | భారతి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 87 |
| పెద్ద సైజు పేజీలు | CT NO BCT |
| ఖాళీ పేజీలు | |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | [illegible] |
| పేజీలు విడదీసినది | [illegible] |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | amrutha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |